## విషయసూచిక

# ఉపోద్ఘాతము

ముందుగా మా మాతా పితరులకు, గురువులకు వందనములు. ఈ గ్రంథ రచనకు నన్ను ప్రోత్సహించిన మిత్రులు, ధర్మపత్నికి ధన్యవాదాలు. అరుణాచలేశునికి, భ్రమరాంబిక సహిత శ్రీశైల మల్లికార్జున స్వామికి నమోవాకములు. తెలుగు వారికి భగవద్గీత సుపరిచితము. శివగీత ఎక్కువగా ప్రాచుర్యములో లేదు.. శివుడు జ్ఞానమునకు మూలమైనవాడు, విశ్వప్రభువు. శివజ్ఞాన సర్వస్వమెరిగిన వాడే సమగ్రపండితుడు. శివుడు కల్యాణ కారకుడు, మంగళకరుడు, శుభకరుడు అటువంటి శివుని కథలు విన్నా, చదివినా, అష్ట ఐశ్వర్యములు కలుగుతాయని పెద్దల మాట. ఇక్కడ అష్ట ఐశ్వర్యములు అనగా అమితమైన, అలౌకిక ఆనందము. భగవద్గీత నర-నారాయణుల మధ్య జరిగిన చర్చ. శివగీత శ్రీరాముడు - పరమేశ్వరుడు మధ్య జరిగిన జ్ఞాన సంవాదము. ఇది అమూల్యము. అతి రహస్యము. భగవాన్ వేదవ్యాస మహర్షి కృపవలన ఈ అమూల్యమైన జ్ఞానము పద్మపురాణాంతర్గతముగ ఆస్తికులకు లభ్యమైనది. భగవద్గీతలోని వేదాంత విషయములకు మూలము శివ గీత అని తెలియు చున్నది. అందువలన ఆధ్యాత్మిక తత్వ ప్రతిపాదితమగు వేదాంత గ్రంధములలో ప్రాచీనమైనది ఈ శివ గీతయే. పద్మ పురాణము ఉత్తర ఖండములో శివుడిట్లనెను.

శ్లో|| అహం మానుష రూపేణ-రామోభూత్వాహరామ్యహమ్, రామో దాశరథీశ్చాహం - కౌసల్యానంద వర్ధన||

రామో మమాంశ సంభూత, స్సీతాచ గిరిజాంశజా|| తా|| నేను మనుష్య రూపములో రాముడనై రాక్షసులను చంపెదను. దశరథ కుమారుడు కౌసల్యా నంద వర్ధనుడగు రాముడను నేనే. రాముడు నా అంశ. సీతాదేవి పార్వతీదేవి యొక్క అంశ. దూర్వాస రామాయణములో శ్రీరాముడు ఇట్లు పలుకుచున్నాడు.

శ్లో|| శివం మాం ప్రతిజానీధ, నావయో రంతరం ద్విజాహ్, ఆవయో రంతరం జ్ఞానం, తథేవ జ్ఞాన మిష్యతః ||

తా|| ఓ బ్రాహ్మణులారా! నన్ను శివునిగా ఎఱుగుము. అజ్ఞానమనగా మాకిద్దరికి భేదమెంచుటయే.

కావున శివకేశవులకు అభేదము అని తెలియు చున్నది. ఇంకా శివుడు శ్రీరామునితో విష్ణువును ద్వేషించిన వాడు శతకోటి జన్మములకైనా మోక్షమును పొందలేరు అని చెప్తారు. చాగంటి వారు చెప్పినట్లు, శివుడు ఎప్పుడు రాముని ధ్యానం చేస్తూ ఉంటాడు. మరి రాముడు శివుని భక్తుడు. అందుకనే శివ - రామ సంవాదమైన "శివ గీత" చాలా మహోత్కృష్టమైనది. పద్మ పురాణాంతర్గత గీతా మహాత్యములో, పరమేశ్వరుడు పార్వతిదేవికి ఈ గీతామహాత్యమును గురించి వివరించుతూ, ఇది సకల సంతాప హారకమును, మహాపాతక వినాశనమును అయి అలరారుచున్నది అని వివరించారు. ఇంకను వివరించుతూ

ఆవులలో  కామధేనువు వలెను, మునీంద్రులలో వేదవ్యాసుడువలెను, దేవతలలో దేవేంద్రుడువలెను, గురువులలో బృహస్పతివలెను, రసములలో అమృతమువలెను, పర్వతములలో కైలాసమువలెను, నక్షత్రములలో చంద్రుని వలెను, తీర్ధములలో పుష్కర తీర్ధము వలెను, పుష్పములలో పద్మము వలెను, పతివ్రతలలో అరుంధతి వలెను, యజ్ఞములలో అశ్వమేధము వలెను, దానములలో భూదానము వలెను, ఉద్యానవనములలో నందనోద్యానము వలెను, రుద్రులలో వీరభద్రునివలెను, నదులలో గోదావరివలెను, పుణ్యక్షేత్రములలో బదరికాశ్రమము వలెను, శాస్త్రములలో శివ గీత మహోత్కృష్టమైనది అని శంకర భగవానుడు గీతామహాత్యమును విశదీకరించెను. వరాహ పురాణములో విష్ణుమూర్తి భూదేవికి గీతా మహాత్యమును గురించి వివరించుతూ నిత్యము శివగీతయగు భగవద్గీతను పఠించుట యందు ఇష్టము కలవాడు ప్రారబ్దవశము వలన కర్మలను అనుభవించు చున్నను లోకమునందు సుఖమును ముక్తిని పొందును, తామరాకును నీరు అంటనట్లు ఆ మనుజుని పాపములు అంటనేరవు. శివ గీత అర్ధవిచారణ చేయు తావునందును, పఠించు తావునందును, రామ సంకీర్తనా స్థలమందున నేనెప్పుడూ ఉందును. అక్కడికి ఎట్టి ఆపదలు రావు అని ఉపదేశించెను.  భగవద్గీత వలెనే శివగీత కూడా పద్దెనిమిది అధ్యాయములు కలిగి ఉన్నది. అక్కడ **'పార్ధాయ ప్రతిబోధితాం'** అని ప్రారంభమైతే, ఇక్కడ **'రామాయ ప్రతిబోధితాం'** అని మొదలవుతుంది. శ్రీరాముడు తారకనామబ్రహ్మము. ***(శివుడు షోడశోధ్యాయము - మోక్షాధికారి నిరూపణము లో వారణాసి, ద్వారక, శ్రీశైలము, చిదంబరం మున్నగు పుణ్య క్షేత్రములలో నివశించే భక్తుల యందు అనుగ్రహముతో నేను వారి దేహ అవసాన సమయమున తారక మంత్రోపదేశము చేసి, తద్వారా వారు పరబ్రహ్మ పదమును చేరెదరు అని చెప్తారు.)*** నారాయణుని అవతారము కేవలము లోకహితార్ధము శ్రీరాముడు ఉపాధిగా ఈ శివగీత ఉద్బవించినది. ఇది జ్ఞాన సుధాసాగరము. భక్తులకు సులభగ్రాహ్యము గావించుటకు సంక్షిప్తం చేయబడినది. ఇది నిత్యపారాయణ గ్రంథము. చదివిన కొద్ది శివభక్తి స్థిరపడుతుంది.

అర్ధపంచకంలో హనుమ అగస్త్యునితో ప్రాప్యుడు అయిన రామునిరూపమును ఈ విధంగా తెలియ చేస్తున్నాడు. శ్రీరాముడుదివ్యములగు అనంత గుణములు కలవాడు, శ్రీమంతుడు, దివ్యమంగళ విగ్రహుడు, షడ్గుణైశ్వర్య సంపన్నుడు. వాక్కునకుగాని,కంటికిగాని, మనస్సునకుగాని, అందనివాడు, జ్ఞానము చేతనే తెలియదగినవాడు. సర్వ సాక్షి. అందరిచే సేవింపబడువాడు. స్వతంత్రుడు. ఇంకనూ ....   **"రామ ఏవ పరం బ్రహ్మ రామ ఏవ పరంతపః, రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మ తారకమ్"**  శ్రీరాముడు పదునారేండ్ల

ప్రాయములో దుఃఖితుడై, విరాగియై ఉన్నప్పుడు విశ్వామిత్రుని కోరిక మేరకు వసిష్ఠ మహర్షి, శ్రీరామునికి ఆత్మ జ్ఞానమును ఉపదేశించుతాడు. 32000 శ్లోకాలతో మానవుని జీవితానికి అద్దము పట్టేలా సుసూక్ష్మమైన ఆత్మ తత్వాన్ని సులభంగా వసిష్ఠ రామ సంవాదంగా వెలసిన కావ్యమే **"యోగ వాసిష్ఠము"**. ఎంత నారాయణుడు అయినా, గురువు అయిన వసిష్ఠ మహర్షి దగ్గర ఆత్మ జ్ఞానము పొందినా మానవునునికి కలిగే మాయా ప్రభావము వలన శ్రీరాముడు దండకారణ్యములో సీతాపహరణము తర్వాత అమితమైన దుఃఖాన్ని పొందుతాడు. సర్వ శక్తి సంవితుడైన చక్రవర్తి అయి ఉండి కూడా వసిష్ఠ మహర్షి కృపచే సంపూర్ణ ఆత్మ జ్ఞానము పొందినా మాయ ప్రభావము వలన ఏమి చేయలేని నిస్సహాయ స్థితిలోకి వెళతాడు. అందుకనే ఆది శంకరాచార్య తన భజ గోవిందం ***శ్లోకం 11 లో మాయామయమిదమ్-అఖిలం హిత్వా బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా / సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుక్రింకరణే//*** అని చెప్తారు. ఈ జగత్తు సృష్టి అంతా మాయామిదం అని, మానవుడు ఆ మాయ నుంచి ఎల్లప్పుడూ జాగరూకతో ఉండాలి అని ఉద్భోదిస్తారు. పూర్వము యుద్ధములో పాల్గొనే యోధుల సామర్ధ్యాన్ని అతి రధ, మహారధ ఇత్యాది నామాలతో పిలిచే వారు. 7,20,000 మందితో ఒకే సారి యుద్ధం చేయగల వారిని మహారథి  అంటారు. అతి మహారథి (మహారథికి 12రెట్లు). అంటే  86,40,000 మందితో ఒకేసారి యుద్ధం చేయగలడు. రామాయణ కాలంలోని రాముడు, వాలి, అంగద, జాంబవంత, రావణ, లక్ష్మణలు మహారథులు. ఇంద్రజిత్తు, పరశురాముడు, ఆంజనేయుడు,  - వీరు అతి మహారథులు. ఇటు రామ, లక్ష్మణ వానర వీరులలోను - రాక్షస వీరులలోను సమానమైన వీరులున్నారని అగస్త్య మహర్షి భవిష్యత్ దర్శనము చేసి ఇటువంటి సమయములో శ్రీరాముడు పరమాత్మను ప్రార్ధిస్తే మోహము వీడి కర్తవ్యము బోధ పడుతుంది అని తలచి దుఃఖంలో ఉన్న శ్రీరాముని చెంతకు ఏతెంచి విరజా దీక్షను ఇస్తాడు. దాని ప్రభావము వలన పరమ శివుడు ప్రత్యక్షమై పాశుపతాస్త్రమును ఇచ్చి, గీతోపదేశము చేస్తాడు. ఇదియే  **శివ గీత** గా ప్రసిద్ధి చెందింది. **ఈ గ్రంధము యోగ వాసిష్ఠము మరియు భగవద్గీత తో సందర్భానుసారముగా సమన్వయము చేయడము అయినది.**

శ్రీరాముడు దండకారణ్యములో ఉన్న సమయములో సీతాపహరణ తర్వాత కలత చెంది, దుఃఖించుతూ లక్ష్మణునితో కలసి ఘోర అరణ్యములు తిరుగుతూ కర్తవ్యము పాలుపోక ఉన్న స్థితిలో అగస్త్య మహాముని శ్రీరాముని సమీపించి మోహము వీడమని చెప్పి విరజా దీక్ష (పాశుపత. శివ దీక్ష) ఇచ్చెను. ఆ మహర్షి ఆనతిన శ్రీరాముడు రుద్రాక్షలు, త్రిపుండరములు ధరించి గోదావరి తీరమున రామగిరి యందు శివ లింగము

ప్రతిష్టించి శివానుగ్రహము కొరకు తపస్సు చేసెను. అందుకు శివుడు సంతోషించి పార్వతి పరివార సమేతంగా దర్శనము ఇచ్చి గొప్ప ధనస్సును, అమ్ములపొదిని, పాశుపతాస్త్రమును అనుగ్రహించి ఆశీర్వదించెను. సంశయాత్మ కలిగిన శ్రీరాముడు పరిపరి ప్రశ్నలు వేయగా శివుడు అతని మోహము పోగొట్టుటకు సమాధానాలు చెప్పెను. ఈ శ్రీరామ పరమేశ్వర సంవాదమే **"శివ గీత"**. ఇది వ్యాస మహర్షి చేత వ్రాయబడిన పద్మ పురాణాంతర్గత ఉత్తర ఖండములోగల ఈ శివ గీత లో 779 శ్లోకాలు ఉన్నవి. శ్రీరాముడు శివుని కోసము తపస్సు చేసిన రామగిరి ప్రదేశము భద్రాచలమునకు 55 కి.మీ.దూరంలో కూనవరం దగ్గర రామగిరి కొండలలో గోదావరి నదీతీరంలో శివాలయము ప్రతిష్టించబడినది. ఇది బైరవ క్షేత్రంగా ఆరాధించబడుతున్నది. అలాగే, కరీంనగర్ జిల్లాలో గోదావరి ఉత్తరమున రామగిరి ఖిల్లా కలదు. ఇక్కడ శ్రీరామునిచే ప్రతిష్టించబడిన శివలింగము, యోగ రామాలయము మొదలైన రామావతార విశేషాలు ఈ ప్రాంతములో ఉండి ఇది కూడా బైరవ క్షేత్రముగా విరాజిల్లుతున్నది. సూత మహర్షి శౌనకాది మహర్షులకు ఈ శివ గీతను చెప్పెను.

***(సర్వదేవతా స్వరూపుడు రుద్రుడు. అలాగే సకల దేవతలు శివాత్మకులే. రుద్రునికి కుడి భాగములో త్రేతాగ్ని (సూర్యుడు, బ్రాహ్మా, దక్షిణాగ్ని) , రుద్రునికి ఎడమ భాగములో ఉమాదేవి, శ్రీమహావిష్ణువు, చంద్రుడు ఉంటారు. అక్కడున్న ఉమాదేవి స్వయముగా శ్రీహరి స్వరూపము కావున శివకేశవులకు భేదము లేదు.ఎవరు శ్రీహరిని పూజించినా శంకరుడ్ని పూజించినట్లే. ఎవరు శివుడ్ని ద్వేషిస్తారో వారు శ్రీహరిని ద్వేషించిన వారు అవుతారు. రుద్రుడిని గురించి తెలుసుకొనలేని వారు శ్రీహరిని గురించి తెలుసుకోలేరు. రుద్రుడి నుంచే బీజం ప్రవరిస్తుంది. ఆ బీజం పుట్టడానికి కారకుడు శ్రీహరి......శుకుని సందేహానికి వ్యాసుని సమాధానం.. కృష్ణయజుర్వేదము, రుద్రహృదయ ఉపనిషత్)***

గ్రంధము సంక్షిప్తము చేసే క్రమంలో చాలా తప్పిదాలు, వ్యాకరణ దోషాలు జరిగి ఉండవచ్చు. పూర్తి వివరణ కూడా ఇవ్వలేకపోవడము అయినది. సలహాలు, సూచనలు ఉంటె అందించ గలరు. పూర్తి వివరములకు మూల గ్రంధము చూడగలరు.

January 2019 భవదీయుడు

Flat No. 301, Tirumala Nivas, Judges Colony, చింతలపాటి వి ఎ దుర్గా ప్రసాద్

Judges Colony, Malakpet, Hyderabad-36. Mail ID: chvadurgaprasad@rediffmail.com

## 1 . ప్రథమాధ్యాయము - శివభక్తి నిరూపణ యోగః

## (గీతాజ్ఞానం-దేవతల కోపం-శివభక్తి-శివారాధన)

సూతమహర్షి, శౌనకాది మునులకు కైవల్య ముక్తిని ఒసగునది, సంసార దుఃఖమునకు ఔషధము వంటిదగు పరమేశ్వర తత్వము అగు శివ గీతను చెప్పదొడగెను. మానవుడు పుణ్య కర్మల వలన గాని, జప తపాదుల వలన కాకుండా **జ్ఞానము** వలననే కైవల్యమనే పూర్ణ స్థితిని పొందగలడు. ***(యోగ వాశిష్ఠములోని ముముక్షు వ్యవహార ప్రకారణములో వసిష్ఠుడు, శ్రీరామునితో జ్ఞాన విచారము వలన దుఃఖాలన్నీ నశిస్తాయి. ఈ సంసారము లోని ఆసక్తి అతి భయంకరమైనది. జ్ఞానము లేని పురుషుణ్ణి అది పాములా కాటేస్తుంది, కత్తిలా నరుకుతుంది, త్రాడులా బంధిస్తుంది, అగ్ని లా దహిస్తుంది, రాత్రిలా గుడ్డి తనం కలగిస్తుంది. మోహాంధం అనే భావి లో పడవేస్తుంది. సంసారాస క్తులు అనుభవించని దుఃఖమే లేదు. విశుద్ధ చిత్తం కలగిన మానవులు ఆత్మ దీపాన్ని పొంది, హరిహర బ్రహ్మాది దేవతులవలనే ఈ సంసారం లో కోరికలు అలజడులు లేకుండా వెలసి ఉంటారు. అని చెప్తారు.)*** అగ్నిహోత్రాది కర్మలు ఆచరించకుండా నిత్యముః జ్ఞాన మార్గములో (ఆత్మ విచారం) ఉండు భాగవతుల వలన దేవతలకు హవిస్సు అందదు. అందువలన వారు మిగుల కోపించి అనేకంగా విఘ్నములు కల్పించెదరు. ***(ఉదాహరణగా యోగావాసిష్ఠము, ఉపశమన ప్రకారణములోని ప్రహ్లాదోపాఖ్యానములో, ప్రహ్లాదుని వేయి సంవత్సరాల నిర్వికల్ప సమాధి లో ఉన్నప్పుడు దైత్యులందరు విష్ణు భక్తి పరాయణలు కాగా విష్ణు భగవానుడు ఇలా ఆలోచన చేస్తారు. దైత్యులందరు విష్ణు భక్తి పరాయణలు కావడము వలన దేవతలతో విరోధం లేకుండా ఉండే పరిస్థితి వచ్చింది. అందువలన భయం లేకుండా దేవత లందరు ఎప్పుడూ స్వర్గ సుఖాలను అనుభవిస్తూ ఉంటే వారికి విసుగు, వైరాగ్యం కలుగుతుంది. అప్పుడు హవిస్సుతో అవసరము లేకుండా వారు కూడా ఆత్మ విచారం చేత శాంతించి బ్రహ్మ పదాన్ని పొందుతారు. దేవతలు శమిస్తే భూలోకంలో యజ్ఞ యాగాది క్రియలు ఆగిపోతాయి. అప్పుడు క్రమంగా మనుష్యులు కూడా శాంతిస్తారు. దాని వలన కర్మ భూమి అయిన భూలోకము, క్రమంగా సూర్య చంద్రులు నశిస్తారు. దానిచే నేనును చిత్త శాంతిని పొంది బ్రహ్మ పదము నందు విశ్రాంతి పొందుదును. ఈ విధంగా సృష్టి మొత్తం ఆకాలంలో శాంతిస్తుంది. ఇది పరమేశ్వరి నియతికి వ్యతిరేకం. అందువలన దానవులు నశించరాదు.)*** ఎవరైతే శివ భక్తి కలిగి ఉంటారో, శివారాధన చేస్తారో వారికి దేవతులు విఘ్నాలు కలిగించలేరు. ఎవరు నియమముతో శివునకు మారేడు దళములు గాని, పవిత్ర జలమును గాని సమర్పించినచో వానికి అభిషేక ప్రియుడైన శివుడు

ముల్లోకములను ఒసగును. ప్రదిక్షిణము కానీ, నిత్యము సర్వకాల సర్వావస్థలలో మనస్సులో చింతించినా కానీ ఆ శంకరుడు ప్రసన్నుడు అగును. మారేడు చెక్కతో తీసిన గంధము, మారేడు దళములు, అడవిలో లభించే పూలు, పండ్లు మున్నగునవి శంకరునకు ప్రియమైనవి. పూర్వము దండకారుణ్యములో భార్యను కోల్పోయిన శ్రీరామునికి అగస్త్య మహర్షి చెప్పిన యోగ శాస్త్రమును చెప్పుచున్నాను  వినుడు అని సూత మహర్షి శౌనకాది మునులకు చెప్పెను.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని శివ భక్తి నిరూపణ యోగము - ప్రథమాధ్యాయము సమాప్తము.

****

## 2 . ద్వితీయాధ్యాయము వైరాగ్యోపదేశ యోగః

## (వైరాగ్యోపదేశము-శాంభవి మాయ)

సూతమహాముని అగస్త్య మహాముని శ్రీరామునికి ఒసగిన విరజా దీక్షను వివరించుచున్నాడు.

**అగస్త్య మహర్షి: రామా!** దేహము జడమైనది. మలపిండాత్మకమైనది. ఇందు జీవము తొలగి నప్పుడు దహించబడుతున్నది. అలాంటి దేహము కోసము ఎందుకు దుఃఖిస్తావు? ఆత్మ సచ్చిదానంద స్వరూపమైనది. సూర్యుడు సకల లోకములకు నేత్రభూతుడైనప్పటికీ నేత్ర దోషములు సూర్యునికి ఎలా అంటవో అలానే సకల భూతములలో ఉండు ఆత్మ ఆయా ఉపాధులలో పొందే దుఃఖములను అనుభవించదు. ఆత్మ నిరాకారమైనది. నవద్వారములు కలిగిన ఈ పురము నందు ఆత్మ నివాస ముండుట వలన దేహమని పేర్కొనబడును. నీ ప్రాణము కన్నా ఏది మిన్న అని భావించెదవో దానిని గూర్చి వివేక బుద్ధితో ఆలోచించుము. అట్టి శరీరము చర్మముతో చేయబడిన తోలు బొమ్మ మాత్రమే!. పాంచభౌతికమైన ప్రకృతి వలన ఆత్మ యొక్క ఉపాధులు కలుగు చున్నవి. ఆత్మ పరిపూర్ణమైనది, సనాతనమైనది. అటువంటప్పుడు పతి ఎవ్వరు? సతి ఎవ్వరు? రామా! నీ యొక్క ఆత్మ స్వరూపమును తెలిసికొనుము. దుఃఖము వదులుము అని ఆశీర్వదించెను.

**శ్రీరాముడు: మహర్షి!** సీత ఎడబాటుతో కష్టాలు పడుతూ, దుఃఖించుతూ, మదన బాణాగ్ని నన్ను దహించుచున్నది. ఇది మాయ అయినచో అటువంటి దానిని గూర్చి నాకు విశ్వాసము కలిగేది ఎట్లా?

అగస్త్య మహర్షి: శాంభవి మాయ శంభుని యొక్క మాయా శక్తి! అట్టి మాయా శక్తిచే జగత్తు మోహించబడుచున్నది. శాంభవి మాయ ప్రకృతి గాను, ఆ మాయకు ఆధారమైన మాయామయుడిని పరమేశ్వరునిగాను తెలిసికొనుము. అట్టి పరమేశ్వరుని యొక్క అవయవ రూపమై ఈ చరాచర జగత్తు వ్యాపించి ఉన్నది. మహేశ్వరుడు సత్య జ్ఞాన స్వరూపుడు, నాశన రహితుడు, విభువు, ఆత్మయు అగును. ***(యోగ వాసిష్ఠములో కూడా వసిష్ఠ మహర్షి శివుడు ఆత్మ స్వరూపుడని చెప్పెను).*** మహేశ్వరుని యొక్క అంశరూపమే సకల జీవుల హృదయములలో ఉన్నది. అనాదికాలమునుండి ఉన్న కర్మవాసనా బలముచే మహేశ్వరాంశమైన జీవులు ఆవిర్భవించును. మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము (మనస్సు) అయిన నాలుగు అంతఃకరణమందు ప్రతిబింబించు శివంశమే జీవి. జీవుడు ఆయా కర్మఫలములను అనుసరించి స్థావర, జంగమ దేహములను పొందును. ఆయా జన్మలలో పొందే సుఖ దుఃఖాలు "ఈశ్వర మాయ" గా గ్రహించు. కామ, క్రోధ, లోభ, మోహ, మధ, మాత్సర్యములు జీవునకు శత్రువులు. అహంకార గతమైనవి. సుషుప్త వ్యవస్థ యందు మాత్రమే జీవుడు శివుడగును.

**శ్రీరాముడు: మహర్షీ!** మీరు చెప్పినవి అన్ని వాస్తవమే అయినప్పటికీ సీత యొక్క ఎడబాటు వలన నాలోని దుఃఖము తగ్గుట లేదు. అహంకారము కూడా అటువంటిదే. ఈ విధముగా ప్రాణి మిగుల పీడింపబడినచో ఈ జడ దేహము వీడిపోవును కనుక జీవాధారణ చేయుటకు తగు ఉపాయము చెప్పవలసినది.

***(ఈ గ్రంథము నందు అగస్త్య మహర్షి ఈ జగత్తుకు కారణము శాంభవి మాయ గా చెప్పగా, వసిష్ఠ మహర్షి యోగ వాసిష్ఠము నందు జగన్మాయా స్వరూపముగా వర్ణించారు. ఆ వివరణ ఏమనగా:***

***సర్వోపద్రవకారకమగు ఈ సంసార దుఃఖమును నివారించుకొనుటకు మనోనిగ్రహము ఒక్కటియే ఉపాయము. అందుకుజ్ఞానము ఉండవలయును. భోగానుభవ వాంఛ బంధహేతువు. ఆ వాంఛను పరిత్యజించుటయే మోక్షము. ఆకాశము సర్వ వస్తుగతము. అయిననుసూక్ష్మమైన దగుట వలన దృశ్యము గాదు. అట్లే నిరంశమగు చిద్భావమును సర్వ వ్యాపి అయ్యు దృశ్యము కాదు. సర్వ సంకల్ప రహితమై, సర్వ సంజ్ఞావిరహితమై, 'చిదాత్మ, స్వాత్మ' అను నామములు ధరించి, అవినాశ స్వరూపమై జ్ఞానుల యందు నిష్కళంకరూపమును, అజ్ఞానుల యందు సంసార రూపమై వెలుగొందుచున్నది. ఇట్టి చిత్పదార్థము ఉదయింపక, అస్తమింపక, లేవక, కూర్చుండక, వెడలక, తిరిగిరాక, ఇక్కడగాని అక్కడగాని ఉండక, పరిపూర్ణంబై ఉండును. ఈ చిత్తు నిర్మలాకారమై ఇది 'జగత్తు' అను నామముతో పిలవబడుచున్నది. అవిద్య చేత, అవిద్యయందు ప్రతిబింబించిన తన రూపాన్నే జీవ చైతన్యంగా గ్రహిస్తూ,అనంత రూపాన్ని వదలి క్రమంగా అహంభావాన్ని పొందుతున్నది. జీవత్వం, పదార్థాల అనేకత్వం దృఢపడినప్పుడు 'ఇది ఉంది, ఇది లేదు' అనే భావం చేత ఇష్టానిష్టాలు 'పూనడం, వదలటం' లకి స్థానమైన దేహాత్మభావం పొందుతున్నది. పలు విధాలైన శారీరక క్రియలద్వారా చిదాత్మయే ప్రపంచాన్ని తనకు భోగ్యంగాచేసికొంటుంది. శబ్ద, రస, రూప, గంధములను తెలుసుకొనుటకు కారణమైనది ఆత్మయగు పరబ్రహ్మస్వరూపము. అది సర్వవ్యాపకమైన బ్రహ్మము అనేకనామములతో అగ్ని యందు ఉష్ణము లాగప్రకాశించుచున్నది. ఇదియే జగన్మాయా స్వరూపము)***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని ద్వితీయాధ్యాయము వైరాగ్యోపదేశ యోగః సమాప్తము.

## 3 . తృతీయాధ్యాయము - విరాజాదీక్ష నిరూపణ యోగః

## (సాధనోపాయము - విరజా దీక్ష)

**అగస్త్య మహర్షి: రామా!** చావు కోరు వాడు ఔషధమును నిరాకరించినట్లే, అరిషడ్వర్గములచే పీడింపవాడు మంచి మాటలు గ్రహించడు. రామా! మహేశ్వరుని నుండి వరములు పొంది, మధ గర్వముతో ముల్లోకాలను పాలించుచున్న రావణాసురుడిని, అతని కొడుకైన ఇంద్రజిత్తుని, అజేయుడైన కుంభకర్ణుని, చిరంజీవి అయిన విభీషణుని జయించుట నీకు సాధ్యమేనా? కామమోహితుడవై లంకేశ్వరుడిని జయించాలి అనుకొంటున్నావు.

***(ఇక్కడ మహర్షి శ్రీరాముని మనోధృడ నిశ్చయాన్ని పరీక్షించు చున్నారు. మహర్షులు సాక్షాత్తు భగవంతుని పరీక్షించడము భృగు మహర్షి చరితము ద్వారా విదితమే కదా!)***

**శ్రీరాముడు: మహర్షీ!** నేను క్షత్రియుడను. ప్రాణప్రియమైన ధర్మపత్ని అపహరించబడినప్పుడు, శత్రువు చేత అవమానింపబడినప్పుడు ఎవడు కర్తవ్యచితుడగునో వాడు లోకములో పురుషాధముడు అగును. కావున నాకు ఉపాయము చెప్పండి.

**అగస్త్య మహర్షి: రామా!** నీకు పరమేశ్వరుడు ప్రసన్నుడు అయినచో నీ కోరికను తీర్చగలడు. అందుకు నీకు విరజా దీక్షను ఒసగెదను. విరాజాదీక్షను ఆచరించుట ద్వారా తేజో మూర్తివి అయి నీ యందు ఉన్న అంతర్బహిర్శత్రువులను జయించి సకలాభీష్టములు పొంద గలవు. **విరజా దీక్షయే పాశుపత వ్రతము.**

***(అధర్వవేద సంబంధిత "అధర్వశిరోపనిషత్" లో రుద్రస్వరూపాన్ని పాశుపతవ్రతం యొక్క విశేషాన్ని మొత్తం ఐదు ఖండాల్లో వివరించబడింది)***

దీనిని శుక్ల పక్షమున చతుర్దశి, అష్టమి, ఏకాదశి తిధులందు కాని, సోమవారం నందు గాని, ఆర్ద్ర నక్షత్రము నందు గాని, ప్రారంభింపవలెను. ఎవనిని రుద్రునిగా, పరమేశ్వరునిగా, బ్రహ్మ, విష్ణు, వహ్ని, వాయుదేవులకు జనకునిగా చెప్పబడెనో అట్టి సదాశివుడిని ధ్యానించవలెను. తర్వాత అగ్నిని పూజించి, పంచభూతములను నియమించి స్థితుడై, అమృతుడై, ఉపవాసము ఉండి, శుచియై, భస్మధారణ చేసి పాశుపత వ్రతమును ఆచరించ వలెను. భస్మము అగ్ని యొక్క వీర్యము. శివ సహస్ర నామ పారాయణము చేయుము. శివ తారక మహామంత్రమును రేయింబవళ్లు జపించినచో, ఆ శంకరుడు ప్రసన్నుడై పాశుపతాస్త్రమును ప్రసాదించును. దాని వలన శత్రువులను జయించి జానకిని పొంద గలవు.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని తృతీయాధ్యాయము - విరాజాదీక్ష నిరూపణ యోగః సమాప్తము.

## 4 . చతుర్థ్యాయము - ఈశ్వర ప్రత్యక్ష యోగః

## (చాతుర్మాస దీక్ష - శివప్రాదుర్భావము)

శ్రీరాముడు విరజా దీక్షను ప్రారంభించెను. పవిత్ర గోదావరి తీరమున గల రామగిరి యందు శివలింగమును ప్రతిష్టించి, దీక్షను సల్పెను. అతను సర్వాంగములందు విభూధిని, రుద్రాక్షలను ధరించి గోదావరి జలములతో శివలింగము అభిషేకించుతూ, వనములందు లభించే పూలు, పండ్లతో విధివిధానంగా పూజ చేయుచుండెను. భస్మమును ధరించిన శ్రీరాముడు భస్మశయ్యపై వ్యాఘ్ర చర్మము పైన ఆసీనుడై శివ సహస్ర నామాలు రేయింబవళ్లు చదువుచు మొదటి మాసమున ఫలములు, రెండవ మాసమున ఆకులు, మూడవ మాసమున జలము, ఆపై వాయు భక్షణము చేయుచు ఇంద్రియములను నిగ్రహించి కోటి సూర్యుల ప్రకాశము, కోటి చంద్రుల శీలము కలవానిని, నిత్యుడు, శాశ్వతుడు, శుద్ధుడు, అక్షరుడు, అవ్యయుడు, సనాతనుడు అయిన అర్ధనారీశ్వరుడిని ధ్యానించుతు విరజా దీక్షను కొనసాగించెను. ఈ విధముగా నాలుగు మాసాలు గడిచాయి.

ఒకనాడు ప్రళయకాల మేఘ గర్జన వలె, క్షీర సాగర మధనము నందు మంధరారావము వలె, త్రిపురాసుర సంహారము నందు రుద్రుని బాణ ధ్వని వలె వినపడెను. అప్పుడు శ్రీరాముడు చకితుడై ఆ మహాతేస్సును తిలకించలేక పోయెను. అప్పుడు శ్రీరాముడు ఇది రాక్షస మాయగా తలచి వసిష్ఠ విశ్వామిత్రులు తనకు ఒసగిన అనేక దివ్యాస్త్రములను ప్రయోగించెను. అవియన్నియు ఆ మహాతేజస్సు లో లీనమైనవి. అది చూచి లక్ష్మణుడు మూర్ఛిల్లెను. శ్రీరాముడు కూడా భయకంపితుడై కనులు మూసుకొని శివసహస్రనామాలు పఠించుతూ ఉమాపతిని శరణు వేడెను. అప్పుడు క్షణ కాలంలో శీతల తేజస్సు, వెనువెంటనే బంగారు వన్నెగల తోక గలది, మరకత మణులను అనుకరించు కొమ్ముల గలది, కురుచ కంఠము కలది అయి ఘంటారావములతో ఉన్న  నందీశ్వరుని చూచెను. తదనంతరము వ్యాఘ్ర చర్మమును ధరించి, జటాధరుడు పదివేల చేతులతో, నానావిధములైన ఆయుధములు ధరించి, మూడు కనులు కలవాడు సచ్చిదానంద స్వరూపుడు అయిన మహాదేవుని శ్రీరాముడు దర్శించెను. అక్కడే అమూల్య రత్నాలంకారములతో ఉండినదియు, సుగంధ పూమాలికలను దివ్య వస్త్రములను దాల్చినదియు నల్లని పువ్వుల వలె ఉన్న కన్నులు కలది అయిన ఆ జగన్మాత అయిన పార్వతి దేవిని చూచెను. అష్ట దిక్పాలకులు తమ కాంతలతో తమ తమ వాహనములపై సామగానం చేయు చుండగా, గరుడ వాహనారూఢుడైన లక్ష్మి సమేత విష్ణుభగవానుడు రుద్రాధ్యాయమును ఉచ్చరించుచుండగా, బ్రహ్మ దేవుడు సరస్వతి సమేతముగా హంసవాహనారూఢుడై రుద్రా సూక్తము పఠించుచుండగా, మునులు శివ స్తోత్రము చేయు చుండెను. గంగా నది, మణి రత్నాదులచే ఒప్పుచున్న సాగరుడిని, మహాదేవుడిని స్తోత్రము చేయుచున్న అనంతాది గొప్ప

ఏనుగులను శ్రీరాముడు చూచెను. సాంబశివుని దక్షిణ భాగమున మూషిక వాహనారూఢుడై వినాయకుడు, ఉత్తర భాగమున మయూర వాహనుడైన కార్తికేయుని, భయంకరాకారులైన మహాకాలుడు, చండీశ్వరుడు ఇరు ప్రక్కల యందు, దావాగ్ని సమానుడైన కాలాగ్ని రుద్రుడును చూచెను. వికృతాకారములు కలిగిన భృంగురిటి, ప్రమాదది గణములు నృత్యము చేయు చుండెను. పంచాక్షరీ మహామంత్రము జపించుతున్న సిద్ధ విద్యాధరులను, రుద్రా గీతాలు గానం చేయుచున్న, కిన్నరులను, త్రయంబకాది మంత్రములను పఠించు బ్రాహ్మణులను, నృత్యము చేయు చున్న రంభాదులను మహతి మీటుచు ఆకాశములో నాట్యము చేయుచున్న నారదుడిని ఇట్టి అనేక శివ గణములను, యక్ష గంధర్వులను అనేక మందిని శ్రీరాముడు చూచెను. అప్పుడు శ్రీరాముడు పట్టరాని సంతోషముతో మహాదేవుని స్తోత్రము చేయుచు ప్రణామంబు చేసెను.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని చతుర్థ్యాయము - ఈశ్వర ప్రత్యక్ష యోగః సమాప్తము.

## 5 . పంచమాధ్యాయము - రామాస్త్ర ప్రధానయోగః

## (పాశుపతాస్త్ర ప్రధానము - రామునకు దివ్యాస్త్ర ప్రాప్తి - హితోపదేశము

**సూతుడు:** పిదప రాముని ముందు అనేక రత్న కాంతులతో విరాజిల్లుతు, ముత్యాల తోరణాలతో, బంగారు గిత్తలు గల గుబ్బములతో, పారిజాత పుష్పాలతో, కస్తూరి, కర్పూరములతో, మేఘ ధ్వని వంటి సకల వాయిద్యములతో కింపురుషులు గావించు వీణానాదములతో ఒక దివ్యమైన బంగారు రధము కనపడినది. శివుడు పార్వతి సమేతముగా నంది వాహనము నుండి దిగి, రధాసీనుడయ్యెను. అప్పుడు శ్రీరాముడు శివపార్వతులకు సాష్టాంగ దండ ప్రమాణము చేసెను. సాంబశివుడు సంతోషముతో రాఘవుడ్ని లేవనెత్తి, కమండలంలోని జలముచే తాను ఆచమనము చేసి, రామునిచే ఆచమనము చేయించి, ప్రేమతో తన తొడపైన కూర్చుండ పెట్టుకొనెను. అనంతరము గొప్పదైన విల్లును, తరగని అమ్ములపొదిని, దివ్యమైన పాశుపతాస్త్రమును అనుగ్రహించెను. మహాదేవుడు శ్రీరాముని చూచి ఇట్లు బోధించెను.

**శంకరుడు: రామా!** ఈ మహాస్త్రము **"రౌద్రము"** (రుద్రునికి సంభంధించినది) జగత్ప్రళయము గావింపచేయును గావున సామాన్య యుద్ధములో ఈ మహాస్త్రమును ఉపయోగించకుము. దీనిని ప్రతిఘటించువారు స్వర్గ, మర్త్య, పాతాళములలో ఎవరు లేరు. ప్రాణాపాయ సందర్భములో మాత్రమే ఉపయోగించ వలెను. అటువంటప్పుడు కాకుండా దీనిని ప్రయోగించిన యెడల జగత్సంహారము జరుగును. అనంతరము పరమేశ్వరుడు దేవతలను, దిక్పాలకులను రావించి – వారితో తమతమ అస్త్రములను రావణ సంహారార్ధము శ్రీరామునికి ఇచ్చి మీరందరు వానరులై సహాయ పడ వలసినదిగా ఆజ్ఞాపిస్తాడు. అందుకు దేవతలు శివాజ్ఞను శిరసావహించి వారు తమ ఆయుధములను శ్రీరామునికి సమర్పిస్తారు. పిమ్మట శ్రీరాముడు భక్తితో ప్రణమిల్లి పరమేశ్వరునితో ఇట్లు నివేదించెను.

**శ్రీరాముడు: పరమశివా!** మనుష్యులకు లవణ సముద్రము దాటరానిది. అచ్చట అనేక కోట్ల మంది రాక్షసులు అతి బలవంతులు, స్వాధ్యాయ నిరతులు, శివ భక్తులు, జితేంద్రియులు, మాయాశక్తి పరులు, బుద్ధిమంతులు, నిత్యాగ్నిహోత్రులు. అలాంటి వారిని లక్ష్మణునితో గూడి ఎట్లు జయించగలను. కర్తవ్య బోధన చేయవలసినదిగా ప్రార్థించెను.

**శంకరుడు: రామా!** రావణుని, రాక్షసులను వధించుటకు విచారింపకుము. దేవ బ్రాహ్మణులను పీడించుట వలన అతనిలో చేటు కాలము దాపురించింది. అందువలన వారి ఆయువు, ఐశ్వర్యము, క్షయ మగుచున్నది. రాజస్త్రీని అపహరించిన రావణుని నీవు సంహరించగలవు. పాపాసక్తుడైన శత్రువును సంహరించుట సాధ్యమే! అధర్మ వర్తుడగు శత్రువు అదృష్టము చేతనే లభించ గలడు. రామా! కిష్కింద ప్రాంతములో దేవతల అంశమున పెక్కు వానరులు జన్మించిరి. వారు బలవంతులు, అజేయులు, నీకు

సహాయము చేయ గలరు. వారి సహాయముతో సముద్రమున సేతు బంధనము చేసి, వారితో లంకానగరమునకు వెళ్లి రావణుని సపుత్ర భాంధవముగా సంహరించి, నీ ప్రియసతి సీతను గైకొమ్ము. రామా! అస్త్రములు లేని వారిపైన, పారిపోవు శత్రువుల పైన, దివ్యాస్త్రములు ప్రయోగించకుము. అట్లయిన తానే స్వయముగా నశించును. రామా! పెక్కు మాటలేల? ఈ జగత్తు నాచే సృష్టించబడి, రక్షించబడి, సంహరింపబడు తున్నది. నేనే జగత్తునకు మృత్యువును, నేనే జగత్తును మ్రింగెదను. యుద్ధము నందు దుర్మదులైన రాక్షసులు నా నోట పడిన వారే. నీవు నిమిత్త మాత్రుడవు. ఈ జీవన సంగ్రామములో నీవు కీర్తిని పొందెదవు గాక! అని అభయ మిచ్చెను.

***(భగవద్గీత పదకొండవ అధ్యాయము విశ్వరూప సందర్శన యోగము లోని 32 - 34 శ్లోకములలో, శ్రీకృష్ణుడు అర్జునినితో "నేను కాల స్వరూపుడను, లోకమంతా పెంపొందించువాడను, నశింపచేయువాడను. భీస్మా ద్రోణాదులందరు నాచే చంపబడిన వారే. నీవు నిమిత్త మాత్రుడవై అని చెపుతాడు)***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని పంచమాధ్యాయము - రామాస్త్ర ప్రధానయోగః సమాప్తము.

## 6 . షష్టాధ్యాయము - విభూతి యోగము

## (రాముని సందేహ నివృత్తి - శివుని విభూతులు - తత్వోపదేశము)

**శ్రీరాముడు: శంకరా!** నీవు చెప్పిన విషయాలు పరమాశ్చర్యము కలుగుచున్నది. నీవు శుద్ధ స్పటిక రూపముతో, త్రినేత్రుడవై, పార్వతి సమేతంగా పురుష రూపమును ధరించి ఉన్నావు. ఈ చరాచర జగత్తునకు ఏ విధముగా సృష్టి, స్థితి, లయ కారణవు అగుచున్నావో, అనుగ్రహము అయినచో వివరింపుము.

**శివుడు: రామా!** నా విభూతులను చెప్పు చున్నాను వినుము. పంచ మహాభూతములు, చతుర్దశ భవనములు, సముద్రములు, పర్వతములు, దేవతలు, రాక్షసులు, ఋషులు, స్థావరములు, చరములు, గంధర్వులు, ప్రమథులు, నాగములు అన్నియు నా విభూతులే. నేను సృష్టికి పూర్వము, వర్తమానములోను, భవిష్యత్తులోనూ ఉంటున్నాను. నేను జగత్తునకు ఆధారమును, నిత్యుడను, అవిద్యా దోష రహితుడను, వేదమునకు, బ్రహ్మకు పతిని నేనే! సావిత్రి, గాయత్రీ మంత్రములను నేనే! స్త్రీ, పురుష, నపుంసకుల శరీరాలను నేనే. నేనే సత్యమును, సర్వ వ్యాపిని, శాంతమును, త్రేతాగ్నిని, గౌరవమును, వాక్కును, రహస్యమును. నేనే జగత్తుకు ప్రభువును, జ్యేష్ఠుడను, సురశ్రేష్ఠుడను. పూజ్యులలో పూజ్యమంతుడను, సకల ఐశ్వర్యాది షడ్గుణ యుక్తుడను, సర్వ సమర్థుడను, ఆది కారణుడను, వేద ప్రోక్తమైన పరమాత్మను నేనే! ఇతిహాసపురాణములు, కల్పములు, మంత్రములు, సూత్రములు, వ్యాఖ్యానములు నన్నే ప్రతిపాదించు చున్నాయి. అవి నా స్వరూపములే! హుతము-ఆహుతి, దాత-దానము, ఇహము-పరము, అక్షరము-క్షరము, దాంతి-శాంతి, అన్నియు నా స్వరూపములే. నాకు జన్మ లేదు. నేనే పరతత్వమును. నేను అవ్యయుడను, ముందు-వెనక, వెలుగు-చీకటి నా స్వరూపములే. త్రిమూర్తులలోను, అష్ట దిక్పాలకులలోను, పంచ మహా భూతములలోను, నక్షత్రములలోను, గ్రహ మండలంలోనూ, ప్రాణము, కాలము, మృత్యువు, అమృతము మొదలగు వాటి యందు తాదాప్య రూపముగా ఉన్నాను. ఓంకార స్వరూపుడను, ప్రణవ స్వరూపుడను. భక్తుల దురితములను హరింతును. ఎవరికి ఉత్తరమున శిరస్సు దక్షిణమున పాదములు ఉండునో అట్టి సర్వోత్తముడను. బ్రహ్మదేవుడు, విష్ణు భగవానుడు, దేవతలు నా ఆద్యన్తములు తెలుసుకొన లేక పోయిరి. అందుచే నన్ను అనంతుడు అందురు. గర్భ దుఃఖము, జన్మ దుఃఖము, జరాదుఃఖము, మృత్యు దుఃఖము మున్నగు దుఃఖ రూపమగు సంసార సాగరము నుండి భక్తులను దాటింతును. కనుక తారుడను నేనే! సమస్త జీవ జాతుల హృదయముల యందు సూక్ష్మ రూపముగా ఉండెదను. అందుచే నేను సూక్ష్ముడను. భక్తులకు విధ్యుత్ ప్రకాశము వలె భాసుర రూపము చూపించెదను. కావున వైద్యుత్తాభిఖ్యుడను. నేనే పరబ్రహ్మను. నేనే రుద్రుడను. నేనే జగత్ చక్షువును. నేనే ఈశానుడను. ఆత్మ జ్ఞానమును కల్గించెదను. కావున నేనే భగవానుడను. సకల

లోకములు నాలోనికి స్వీకరించి తిరిగి విడచెదను, మరల కల్పించెదను. నా విభూతుల చేత సర్వ భావములను సృజించుతున్నాను. కావున నేనే మహేశ్వరుడను, మహాదేవుడను. హృదయాకాశము మధ్యలో వాలాగ్రామాత్రము (వెంట్రుక చివరి భాగము) వలె జ్యోతి స్వరూపుడను. నేనే సర్వ కారణ భూతుడను. పదార్థములన్నియు నా విభూతులే! అణువు కన్న అణువును, మహత్తు కన్న మహత్తును, విశుద్ధుడను, పురాతనుడను, పురుషుడను, హిరన్మయుడను, శివ స్వరూపుడను, ఆకాశ స్వరూపుడను. నన్ను తెలుసుకొను వారు ఎవ్వరు లేరు. నేను చిత్ స్వరూపుడనై సకలము తెలుసుకొందు. నా యందు పుణ్య పాపములు లేవు. నాకు నాశనము, జన్మము లేదు. నాకు దేహేంద్రియ బుద్ధి రూపమగు ఉపాధులు లేవు. నేను పంచభూతాత్ముడను కాను.

రామా! ఎవ్వరీ ప్రకారముగా నా విభూతులను, నా స్వరూపమును ఎరుగుదురో వారు పరిశుద్ధమగు పరమేశ్వర స్వరూపమును పొందుదురు, కైవల్యమును పొందుదురు.

***(భగవద్గీత లోను పదవ అధ్యాయము అయిన విభూతి యోగము తో అనుసంధానించు కొంటె శ్రీకృష్ణుడు తన విభూతుల గురించి వివరిస్తూ – "నేను సమస్త మానవుల హృదయాలలో ఆసీనుడనై యున్నాను. సమస్తమునకు ఆది, మధ్య, అంతము నేనే అనగా దైవమునకు ఆది అంతము నామము రూపము లేవు.. ఆదిత్యులలో విష్ణువును. తేజోమయమైనవానిలో సూర్యుడను. గోవులలో కామధేనువును. దైత్యులలో ప్రహ్లాదుడను. ఆయుధ ధారులలో రాముడను. నదులలో గంగ. స్త్రీలలో కీర్తి, మేధ, క్షమ. పాండవులలో అర్జునుడను. మునులలో వ్యాసుడను. వృష్ణులలో వాసుదేవుడను. విజయులలో జిగీషను. మోసగాళ్ళలో ద్యూతాన్ని. జలచరాలలో మొసలిని. జలరాశులలో సముద్రాన్ని. వేయేల? ఐశ్వర్యమయము, కాంతిమయము, శక్తి మయము ఐనవన్నియు నా తేజస్సులో ఒక అంశనుండి కలిగినవి. సప్తర్షులు, సనకసనందనాదులు, మనువులు నా మానసమునుండే ఉద్భవించారు. జ్ఞానులు నా దివ్య విభూతులను తెలిసికొన్న వారై, నాయందే మగ్నులై, పరస్పరం నాగురించి ఒకరికొకరు బోధించుకొంటూ ఆనందిస్తుంటారు.")***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని షష్టాధ్యాయము - విభూతి యోగము సమాప్తము.

## 7 . సప్తమాధ్యాయము - విశ్వరూప సందర్శన యోగం

## (ధర్మ సందేహము - విశ్వరూప సందర్శనము - విశ్వరూప స్తవము - ఉపసంహారం)

**శ్రీరాముడు: హే భగవాన్!** పరిచ్ఛిన్నమగు పరిమాణము కల్గిన నీ దేహము నుండి సకల భూతములు ఏ విధముగా ఉత్పత్తి, స్థితి, లయములు అగుచున్నవి. తమ అధికారములలో నుండి సృష్ట్యాధులను కావిస్తున్న బ్రహ్మాది దేవతలును, చతుర్దశ భవనంబులు నీవే అగుచున్నావు? ఓ పరమేశ్వరా! ఈ విషయము పలుమార్లు విన్నప్పటికి నా సందేహ నివృత్తి కావడం లేదు కావున విశదీకరించి వలసినది.

పరమేశ్వరుడు: రామా! మర్రి విత్తనము చిన్నదైనప్పటికీ దాని యందు ఎలాగైతే మహావృక్షం ఇమిడి ఉన్నదో అలాగే సకల ప్రాణికోటి, సకల ప్రపంచము నా దివ్య శరీరము నందే ఉత్పన్నమౌచున్నది, ఇమిడి ఉన్నది. ఉప్పుగడ్డ ఏ విధముగా నీటిలో కరిగి పోయిన తర్వాత పాకముచే మొదటి రూపము పొందు చున్నదో, సూర్య మండలము నుంచి ఉదయము వెలువడిన కాంతి ఏ విధముగా అట్టి సూర్యుని యందే సాయింత్రము లయించునో అదే విధముగా నా యందు ఉత్పన్నమైన సకల లోకములు నా యందే లయమగు చున్నవి.

శ్రీరాముడు: పరమేశ్వరా! ఎన్ని విధములుగా భోధించినను దిగ్భ్రమ చెందిన మనుజునకు దిక్కు తోచనట్లుగా నాకేమి భోధపడుటలేదు. నేనేమి చేయుదును అని వినమ్రముతో నమస్కరించెను.

**పరమేశ్వరుడు: రామా!** ఈ చరాచర ప్రపంచ మంతా నా యందే ఉన్నది. నీ చర్మచక్షువులతో నా దివ్య తేజోమండలమును చూడలేవు కావున నీకు దివ్య చక్షువులను ప్రసాదించు చున్నాను, తిలకించుము.

సూతుడు: ఇట్లు ఉపదేశించిన వాడై, పరమేశ్వరుడు శ్రీరామునికి దివ్య చక్షువులు అనుగ్రహించెను. అప్పుడు శ్రీరాముడు పాతాళ లోకముతో సమానమైన, కోటి మెరుపులతో సమానమగు అతి భయంకరమైన ఆ పరమేశ్వరుని నోరును చూడగానే భయకంపితుడై మోకాళ్లపై కూలబడి సాష్టాంగ దండ ప్రమాణము చేసి మాటిమాటికి స్తుతించెను. విభూతిధారి యగు ఆ మహాదేవుని ముఖము నందు అగ్ని జ్వాలలతో ఆవృతమైన అనేక కోట్ల బ్రహ్మాణ్డములు చిన్న చిన్న పక్షుల వలె కనపడెను. మేరు, మంధర, వింధ్య ఇత్యాది మహాపర్వతములు, సప్త సముద్రములు, సూర్య, చంద్ర, నక్షత్రములు పంచ భూతములు, ఇంద్రాది దేవతలు, అరణ్యములు, మహానాగులు కనపడు చుండెను. అనేక బ్రహ్మాణ్డములు, అందు ఏడేడు పదునాలుగు లోకములు, త్రిపురాసుర సంహారము, దేవదానవ సంగ్రామము, మహావిష్ణువు యొక్క దశావతారములు, జరిగినవి, జరుగ బోవునవి, జరుగు చున్నవి, ఉత్పత్తి కాకుండానే నశించునవి అనేకము శ్రీరాముడు చూచి భయ భ్రాంతుడై శివుని స్తోత్రము చేయుచుండెను.

**శ్రీరాముడు: ఓ దేవా!** నా యందు ప్రసన్నుడవుకమ్ము. సంసార భయము నుండి అనాధుడనగు నన్ను రక్షింపుము. నీ మాయ చేతనే ఈ విశ్వము కల్పింపబడి, నీ యందే కనబడుచున్నది. భ్రాంతిచే జనులు

ముత్యపు చిప్ప యందు వెండి వలె, త్రాడు నందు పాము వలె; ఈ సకల ప్రపంచమును నీ కంటే వేరుగా చూచు చున్నాను. నీ దివ్య తేజస్సు చేతనే ఈ చరాచర ప్రపంచమంతయు ఆవరించి ప్రకాశవంతము చేయుచున్నావు. నీ ప్రకాశము లేని యడల ఈ విశ్వము ఒక్క క్షణము కూడా ప్రకాశించదు. ఓ మహాదేవా! ఇది అంతయు నీ మాయగానే గ్రహించితిని. నీ యందు మాయచే కల్పితమగు ఈ ప్రపంచము యధార్ధము కాదు. విచారించగా నీదు శరీరము విశ్వమునకు ఆధారమని భావించడము కూడా అజ్ఞానమే. ఎందుకనగా నీవు స్వయంభువు! పరిపూర్ణుడవు! చిదానంద స్వరూపుడవు! పూజలు, ఇష్టకర్మలు, అపూర్త కర్మలు మొదలగునవి ఆచరించు వారికి మంచి ఫలితములను నీవే ప్రసాదించేవని చెప్పడం అసత్యమే! ఎందువలన అనగా అంతా నీవే కదా! నీ కన్నా భిన్నమైనది వేరొకటి లేదు కదా! ఓ పరమేశ్వరా! పూజలు, ఉపచారములు మున్నగు బహుక్రియలచే నీవు సంతుష్టుడవు అగుదువని అజ్ఞానము చేత మూఢులు పలికెదరు. నీవు అమూర్తుడవు (ఆకార రహిత స్వరూపుడవు) అటువంటి నీకు పూజాది కార్యక్రమముల ద్వారా భోగేచ్ఛ ఎక్కడిది. ఎవ్వరైతే కొంచెము బిల్వ దళములు, ఉదకములను భక్తితో సమర్పించెదరో వారిని నీవు అనుగ్రహించి ముల్లోకములలో గల ఐశ్వర్యము ఇచ్చెదవని జనులు అజ్ఞానము చేత తలంచెదరు. ఓ శివా! నీవు ఒక్కడివే సర్వాంతర్యామివి, పురాణపురుషోత్తముడవు, నీకు నాశనము లేదు, అఖండ చైతన్య స్వరూపమైన నీవొక్కడివే వెర్వేరు అంతఃకరణములలో అనేక రూపములందు గోచరించెదవు. ఓ దేవా! ఈ చరాచర ప్రపంచమును సృజించుటకు, పోషించుటకు, నశింపచేయుటకు నీకు ఏమి ప్రయోజనము లేదు. అనాది కాలము నుండి వచ్చిన ప్రాణుల పుణ్య పాపముల ననుసరించి వారి వారి కర్మ ఫలములను అనుభవించెదరు. అయినప్పటికీ స్వప్నము వలె ఈ ప్రపంచమును విస్తరింప చేసెదవు. ఓ శంభూ! స్థూల, సూక్ష్మ, జడ దేహములకు నీకు భేదము ఏమియును లేదు. కనుక సుఖ, దుఃఖములకు నీవే కారణమని వేదములు ఘోషించు చున్నవి. పరమేశ్వరా! సకల పాపములను సంహరించు జ్ఞాన స్వరూపుడవగు నీకు దండము. మిధ్యాస్వరూపమైన చిత్త వృత్తులను అనుభవించు పరమాత్మ స్వరూపుడవగు నీకు ప్రణామము అంటూ విశ్వరూప సందర్శనము చేత ఆశ్చర్యచకితుడై చేతులు జోడించి నమస్కరించి నిలబడెను. ఓ విశ్వాత్మా! నీ విశ్వరూపమును ఉపసంహరించుము. ఓ శంభూ! నీ దివ్యానుగ్రహము వలన సర్వ జగదేకమును (ఈశ్వరుడు, జీవుడు, జగత్తు మూడింటి యొక్క అఖండ ఏకత్వమును) దర్శించితిని.

**శంకరుడు: రామా!** ఈ రూపములో నా కంటే మరియొక్కడు ఎవ్వడు లేడు అని పలికి తన విశ్వ రూపమును ఉపసంహరించు కొనెను.

శ్రీరాముడు సంతోషాతిరేకమున కన్నులు మూసుకొని తెరిచినంతలో పరమేశ్వరుడు పర్వత శిఖరమునందు పులి చర్మముపైన కూర్చుని తన సౌమ్య రూపమును చూపెను. పరమశివుడు సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన, అను ఐదు ముఖములతో, నీలవర్ణమగు కంఠముతో సూర్యచంద్రాగ్నులను

మూడు కన్నులతో విభూధిని దాల్చిన దివ్యమంగళ విగ్రహముతో విరాజిల్లెను. అటువంటి జగదీశ్వరుడగు శివుని రూపమును దర్శించిన అనంతరము శివుని ఆజ్ఞచే రాఘువుడు అతని ముందుకెళ్లి నమస్కరించి కూర్చొనెను.

**శంకరుడు: రామా!** నీవు ఏ విషయములను ప్రశ్నించెదవో ప్రశ్నించుము. నీకు బోధించే విషయమై నా కంటెను మరొక గురువు నీకు లేడని ఈశ్వరుడు ఆనతి ఇచ్చెను.

***(భగవద్గీత లోని పదకొండవ అధ్యాయము అయిన విశ్వరూప సందర్శన యోగము తో అనుసంధానించు కొంటె శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును అర్జునునికి చూపినప్పుడు, అర్జునుడు ఆ విశ్వరూపమును చూచి సంక్షిప్తముగా ఈ విధముగా స్తుతించుతున్నాడు. -- "దేవదేవా! జగత్పతే! అనంతరూపా! సూర్యునివలె ప్రజ్వలించుచున్న నీ అనంత రూపము చూడ నాకు శక్యము గాకున్నది. నీవు దేవదేవుడవు, సనాతనుడవు. అనంత శక్తి సంపన్నుడవు. నీయందు బ్రహ్మాది సమస్త దేవతలు కనిపించుచున్నారు. దేవతులు, మహర్షులు, పితరులు నిన్ను స్తుతిస్తున్నారు. ప్రభో! నీకు అనేక నమస్కారములు. మరల మరల నమస్కారములు. ప్రసన్నుడవు కమ్ము" అని ప్రార్థించాడు. అర్జునుని కరుణించి భగవానుడు తన రూపాన్ని ఉపసంహరించి ఆ అద్భుత రూపాన్ని దర్శించడం తపస్సు వలన కాని, వేదాధ్యయనం వలన గాని అలవి కాదని చెప్పాడు. అనన్యమైన భక్తి వలన మాత్రమే ఆ దివ్యరూపాన్ని తెలుసుకోవడం సాధ్యమని తెలిపాడు.)***

***(అధర్వవేద సంబంధిత "అథర్వశిరోపనిషత్" లో పరమేశ్వరుడి విశ్వరూపాన్ని, ప్రణవ (ఓంకార) మంత్రస్వరూపాన్ని మొత్తం ఐదు ఖండాల్లో వివరించబడింది)***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని సప్తమాధ్యాయము - విశ్వరూప సందర్శన యోగం సమాప్తము.

## 8 . అష్టమాధ్యాయము వైరాగ్య యోగః

## (జరాయుజము - పిండోత్పత్తి వర్ణనము - గర్భవాస దుఃఖము - చతురావస్థలు - మరణావస్థ)

**శ్రీరాముడు: భగవాన్!** లింగ దేహము నందు పంచభూతములతో కూడిన శరీరము ఏ విధంగా ఏర్పడుచున్నది? దీని స్థితి నాశము ఎట్లు గలుగునో సవిస్తరంగా చెప్ప వలసినది.

శివుడు: ఈ దేహము పాంచభౌతికము. ఇందు భూతత్వము ప్రధానంగా ఉండును. మిగిలిన నాలుగు సహకారులు. పంచభూతాత్మకమగు దేహము చతుర్విధములు. **1. జరాయుజము, 2. అండజము, 3 . స్వేదజము, 4. ఉద్భిజము.** ఈ చతుర్విధ దేహముల కంటే భిన్నమైనది దేవతలకు ప్రాప్తించును. వీటిలో నర మృగాదులు జరాయుజము.

శుక్ర శోణితముల సంయోగము వలన ఉత్పన్నమైనదే జరాయుజము. స్త్రీ యొక్క గర్భాశయమున శుక్రము (వీర్యము) ప్రవేశించి, అక్కడ శోణితము (రజస్సు) తో సంయోగము చెందును. శోణితము విశేషమైన స్త్రీయును, శుక్రము అధికమైన పురుషుడు, శుక్ర శోణితములు సమానమైన నపుంసకుడు కలుగును. స్త్రీ ఋతుస్నానము నాలుగవ రోజన చేయును. ఆ రోజు నుండి పదునారవ రోజు వరకు ఋతుకాలముగా నిర్దేశించబడినది. ఐదవ దినము మొదలుకొని బేసి దినములలో (5-7-9-11-13) రాత్రి సమయములో భర్త సంగమము కలిగెనేని స్త్రీ సంతానమును, సరి దినములలో (4-6-8-10-12-14-16) పురుష సంతానము కలుగును. ఋతుమతికి పదహారవ దినమున గర్భము నిలిచెనేని పుట్టిన వాడు చక్రవర్తి అగును. ఇందులో సందేహము లేదు. ఋతుస్నానము చేసిన స్త్రీ కోరికతో ఏ పురుషుని ముఖమును చూచునో ఆ ఆకృతిగల గర్భమే కలుగును. కనుక స్త్రీ ఋతుస్నానము చేసిన పిదప భర్త ముఖమునే చూడవలెను. పూర్వజన్మ సుకృతము చేత స్త్రీ యోని యందు ప్రవేశించిన శుక్రము రజస్సుతో సంయోగము చెందును. అప్పుడు పిండోత్పత్తికి కారణ మగును. మొదటి మాసమందు అది ద్రవ రూపముగా ఉండును. రెండవ మాసము నెమ్మదిగా బుద్బువ రూపమగును. కరచరణములు, మస్తకము మూడవ మాసమున, నాలుగవ మాసము నందు జీవచైతన్యము పొందును. తల్లి గర్భము నందు పిండము తనంతట తాను చలించు చుండును. పుత్రుడైనచో కుడి ప్రక్క, కన్య అయినచో ఎడమ ప్రక్క, నపుంసకుడు అయినచో మధ్య భాగములో కదలిక ఉండును. జీవి పురుషుడైనచో స్థిరత్వాధి భావములు, స్త్రీ అయినచో చంచల భావములు, నపుంసకుడైనచో మిశ్రమ భావాలు కలిగి ఉండును. గర్భిణీ స్త్రీ రెండు హృదయములు ధరించును కావున "దౌహృది" అని అందురు. ఐదవ మాసమునందు చిత్తము జాగృత మగును. మాంస రక్తములు పుష్టిని పొందును. ఆరవ మాసము నందు ఎముకలు, నరములు, గోళ్లు, వెంట్రుకలు మున్నగునవి వికాసము నొందును. ఏడవ మాసము నందు బలము, వర్ణము కల్గి, దేహము అంగపూర్ణతతో ఉండును. గర్భస్థ శిశువు ఆ సమయము

నందు కాళ్ళ మధ్య నుండి చేతులతో చెవుల రంధ్రములను మూయబడి ఉండును. ఈ విధముగా గర్భవాసము యొక్క దుఃఖమునకు ఉద్విగ్నుడై; గర్భభయాన్వితుడై ఉండును. తల్లి గర్భములో ఉన్న శిశువుకు జ్ఞానము కల్గి **"హా కష్టము"** అని విషాదముతో విచారించుచు, తన ఆత్మను గూర్చి శోకించు చుండును. ఈ విధముగా పూర్వము అనేక పాపదేహములు పొంది అనేక నరక బాధలు అనుభవించితిని అని శోకించుతూ అట్టి దుఃఖము నుంచి ఉపశమునకు మోక్షోపాయమును గురించి చింతించు ఉండును.

ఎనిమిదవ మాసమున చర్మము యొక్క ఆవరణము, అవయవములలో చలనము కలుగును. హృదయము నుండి ఓజస్సు (శుభ్రమైన వర్ణము కలది), తేజస్సు (కొంచెము పచ్చపచ్చగా రక్త వర్ణముతో కూడినది) కలుగును. ఈ రెండును జీవితమునకు ఆశ్రయములుగా ఉండును. ఈ ఎనిమిదవ మాసమున శిశువు జన్మించినచో ఓజస్సుచే విడువడి జీవించదు. తొమ్మిది లేక పదవ మాసములు శిశువు ప్రసవించుటకు సరి అయిన సమయము. గర్భవాసము నందు శిశువు తల్లి యొక్క శోణితమును ఆశ్రయించి, శిశువునకు నాభి యందు ఉన్న నాడి ద్వారా, తల్లి యొక్క ఆహార రసములు లోనికి వేళ్ళు చుండును. ఆ విధముగా తల్లి ఆహారముచే గర్భస్థ శిశువు పోషించ బడుతూ సజీవంగా ఉండును. ఎముకల యంత్రమయమగు యోని నుండి పీడింపబడినవాడై అదే ద్వారము నుండి జారాయి కోశముతో చుట్టబడి మెదడు రక్తములచేత మూయబడిన సమస్తావయవ పరిపూర్ణుడై వెల్లికిల క్రింద బడును.

ఆ సమయము నందు శిశువు మాంసపు ముద్ద వలె ఉండును. అసమర్థుడై, స్వజనుల చేత రక్షింప బడుతూ ఉండును. బాల్యములో శిశువు తండ్రిని రాక్షసునిగాను, తల్లిని ఢాకినిగాను, పాలును పూయముగాను భావించుచుండును. కావున శైశవము బహు కష్టమైనది. శ్లేష్మము (కఫము) చే సుషుమ్నా నాడి కప్పబడి ఉన్నంతవరకు అక్షరములు అభివ్యక్తము కాదు.

యువ్వనము వచ్చినప్పుడు మన్మథ జ్వరముచే పీడింపబడుచు రాగాలాపన చేయుచు, ధన శక్తి సంపదపై గర్వించుచు, కామ-క్రోధ-మధ-మాత్సర్యములతో కూడి ఎవ్వరిని లెక్క చేయడు. వార్ధక్యం మిక్కిలి అనాదరణ స్థితి. శ్లేష్మము చేత ఉదరము కప్పబడి, తినిన ఆహారము జీర్ణము కాక, దంతములు కదులుతూ, కంటి చూపు మందగించి, వాతముచే నడుము మెడ వంగి, చేతులు కాళ్లు బలహీనపడి అనేక రకముల రోగములు చేత ఆవరింపబడి, బంధువులచేత తిరస్కరింపబడి అనేక దుఃఖములు కలిగినను, భోగములను కోరుచుండును.

మరణము యొక్క దుఃఖమును వర్ణించడానికి సమానమైన దృష్టాంతములు లభించవు. అది రోగములచేతను, దారిద్ర్యముల చేతను పొందిన దుఃఖముల కంటే అధికమైనది. రోగులు, దరిద్రులు, మున్నగువారు కూడా మరణమునకు భయపడుచున్నారు. సముద్రమున దాగియున్న సర్పమును గరుత్మంతుడు ఏ విధముగా ఎత్తుకొనిపోవునో అదేవిధముగా బంధు జనముచేత కౌగలింపబడిన వ్యక్తి

యొక్క ప్రాణములను మృత్యుదేవత తీసుకొని పోవును. ప్రాణవాయువులు మర్మ స్థానములను విడిచి పెట్టుచుండగా చేతులు, కాళ్ళు మున్నగువాటి సంధులు విడిపోవుచుండగా మరణించువాడు ఘోరమైన దుఃఖమును అనుభవించును. యమదూతలను చూచినప్పుడు దృష్టి స్తబ్ధమగును. ప్రజ్ఞ మందగించును. ఆ సమయమున మృత్యు పాశముచే కట్టబడిన జీవుణ్ణి రక్షించువారు కానరారు. మరణ సమయములో జీవి అజ్ఞానముచే ఆవరింపబడినను, గొప్ప వివేకము పొంది ఉండును. జ్ఞాతులు పిలుచు చున్నప్పుడు వారి వైపు దీనంగా చూచు చుండును. అప్పుడు మాట్లాడు శక్తిలేక చూపు మాత్రమే కల్గి ఉండును. జీవాత్మ ఒకవైపు యముని యొక్క కాలపాశముచే లాగబడుతూ మరొకవైపు బంధుమిత్రుల స్నేహ రూప పాశముచేత లాగబడుతూ ఉంటూ సహాయము కొరకు ఎదురు చూచు చుండును. ఆ సమయమున ఆత్మజ్ఞాని శ్వాస ఎక్కిళ్లచేత కట్టపడినప్పుడు, మృత్యువు ఆకర్షింపబడినప్పుడు, రక్షించు వారెవ్వరు లేకున్నను తొందరపడక, తన హృదయమున పరమశివుడ్ని ధ్యానించును. యమదూతలు కాలపాశమును బంధించినప్పుడు జీవుడు దుఃఖితుడై అతి కష్టము మీద దేహము నుండి ప్రాణమును వదులును. కర్పూర చందనాదులతో పూయబడి, విచిత్ర భూషణాదులతో వస్త్రములతో అలంకరింపబడిన ఈ శరీరము నుంచి జీవాత్మ వీడిన పిదప ఒక్క క్షణము కూడా ఇంటి యందు ఉంచక శ్మశానమునకు తీసికొనిపోయి దహించి వేయుదురు. పిమ్మట నూరు కోట్ల జన్మలకైనను ఈ శరీరము మరల కనిపించదు. మాయాకల్పితమైన ఈ జగత్తులో తల్లి, తండ్రి, గురువు, స్వజనులు అందరూ అంతా అసత్యములే. మృత్యువునకు జన్మము, జన్మమునకు మృత్యువు బీజములు. నరుడు కుమ్మరి చక్రము వలె విశ్రాంతి లేకుండా ఎప్పుడు తిరుగు చుండును. రామా! స్త్రీ గర్భములో పురుషుని శుక్రము పడినది మొదలు మరణము వరకు నీకు చెప్పబడిన సంసారమంతయు దుఃఖభూయిష్టమైనది. ఈ సంసార మహావ్యాధి జన్మమృత్యువుల దీర్ఘరోగము. దీనికి నాకంటే మరియొక ఔషదము లేదు.

***(గరుడ పురాణము లోని ఆరవ అద్యాయంలో జనమరణాల చక్రం గురించిన వివరణ ఉంటుంది.)***

***(16 సంవత్సరాల ప్రాయములోనే శ్రీరామునికి ఈ జీవుడిని గురించి వైరాగ్య భావము ఏర్పడుతుంది. విశ్వామిత్రుని ప్రశ్నతో, శ్రీరాముడు తనలో కలిగిన వైరాగ్య భావాలను వివరిస్తాడు. అప్పుడు విశ్వామిత్రుని కోరిక మేరకు వసిష్ఠ మహర్షి శ్రీరామునికి ఆత్మ జ్ఞానము వివరిస్తారు. ఇదియే యోగా వాసిష్ఠము. సూక్ష్మంగా జీవుడిని గురించిన శ్రీరాముని వైరాగ్య భావము క్రింద ఈయబడినది.***

***అన్ని జీవులు పుట్టటాని కై చనిపోతున్నా రు. చావటానికై పుడుతున్నా యి. భోగాలు, ఆపదలు అశాశ్వతం. ఆయుర్దాయం క్షణ భంగురం. ఏదో క్షణములో చటుక్కున వదిలి పోతుంది. ఈ ఆయువు అశాంతి, అసంతృప్తి, శ్రమలకు కారణము. రోగాలనే పక్షులకు గూడు లాంటిది. మృత్యువు ఈ జీవితాన్ని కబళించడానికి చూస్తూ ఉంటుంది. త్రిమూర్తులు కూడా కాలానికి లోబడల్సిందే. శరీరం ఒక మలమూత్ర తోలుసంచి. ఎంత పోషించిన***

*మరల మరల వాటినే కోరుకుంటుంది. మరణ సమయములో జీవుణ్ణి అనుసరించకుండా ఉండిపోయే కృతఘ్నుడు ఈ శరీరము. దీని మీద నమ్మకము ఎట్లా? బాల్యం: చంచలం, భయానికి ఇల్లు. శక్తి లేక పోవడము వలన చిన్న చిన్న కోర్కెలు, మనసులోని భావాలు చెప్పలేరు. మూఢత్వము, చాపల్యము, దైన్యము - ఇవన్నీ బాల్యావస్థలో కనబడతాయి. క్షణ భంగురమైన యవ్వనం మీద మోహం దుఃఖ మయం. అప్పటివరకు నిద్రాణంగా ఉన్న కామపిశాచి బలవంతంగా పురుషుణ్ణి లోబరచు కొంటుంది. భ్రమలను కల్పించి సదాచారాన్ని మరిచి పోయేటట్లు చేస్తుంది. యవ్వనం ముగియక మునుపే ముసలితనం దాన్ని మింగేస్తుంది. అయినా బ్రతుకు మీద ఆశ నశించదు. ముసలితనంలో శిథిలమైన పురుషుడిని గాడిదను చూసినట్లుగా అసహ్యముగా చూస్తారు. ముసలివాడిని చూసి సేవకులు, పుత్రులు, భార్య, బంధువులు, స్నేహితులు హీనుణ్ణి చూసి నవ్వినట్లు నవ్వుతారు. కాలం ఎవరినైనా మింగేస్తుంది.)*

*(భాగవతము, మూడవ స్కందము దేవహూతి కపిల సంవాదములో పై విధమైన జీవుని గర్భవాసగతిని వివరిస్తూ ... కర్మవశంబున అన్నముద్వారా రేతస్సును ఆశ్రయించి పిమ్మట స్త్రీ గర్భములో ప్రవేశించును అంతట ఆ రేతస్సు స్త్రీ గర్భములోని శ్రోణిత సంబంధము కలిగి మూడు రోజులలో వర్తుల రూపము దాల్చును. పది దినములలో రేగు పండంత అయి క్రమ క్రమముగా మాంసపిండాకారము దాల్చును ఒక నెలకు శిరస్సు ఏర్పడును. రెండు నెలలకు కరచరణాద్యవయవ సన్నివేశము కల్గును. మూడు నెలలకు నఖగోమాస్తి లింగ రంధ్రములు ఏర్పడును. నాలుగు నెలలకు సప్త ధాతువులు ఏర్పడును. ఐదు నెలలకు క్షుత్పిపానలు కలుగును. ఆరు నెలలకు జరాయువేష్టితుడై తల్లి గర్భమున తిరుగుచుండును. అప్పుడు తల్లి తినిన ఆహారములోని, కారము, ఉప్పు, పులుసు మున్నగు వాని వలన తన సుకుమార దేహమునకు బాధ కలుగగా దుఃఖించును. ఏడవ నెలలో దైవవశమున పూర్వ జన్మ స్మృతి కలిగి పూర్వకర్మ వలన తనకు గర్భవాస బంధనము అనుభవించవలసివచ్చెనేయని పరితపించుచూ పరమేశ్వరుని యింట్లు ప్రార్థించును "స్వామీ నానా గర్భవాస రూపంబైన ఈ దుఃఖము ఇక కలుగకుండ నేను బయటపడిన తరువాత నీ ధ్యానము చేసి, సంసారమునుండి నన్ను ఉద్ధరించుకొందును" గర్భవాస నరకము అనుభవించుచుండగా పదవ నెల రాగా ఉద్భవించి భూమిమీద పడగానే గర్భములో నుండగా కలిగిన వివేకముపోయి విపరీతజ్ఞానము కలిగి ఏడ్చును. క్రమముగా పెరిగి పెద్దవాడై యవ్వనము రాగానే స్త్రీ వశుడై భగవత్ చింతనలేక అధర్మ కార్యములను ఆచరించి మరణించిన తరువాత నరకము పాలగును. కావున బుద్ధిమంతుడైన మానవుడు కామమునకు వశుడు కాక స్త్రీల మోహమునకు చిక్కక భగవదారాధన రూపముగ స్వధర్మమును నిష్కామముగ ఆచరించి పరమేశ్వరుని ఉపాసించి దేహాంతమున బ్రహ్మలోకమునకు పోయి ఆ బ్రహ్మతో కూడ శ్రవణాదుల ద్వారా ఆత్మజ్ఞానము కలిగి సచ్చిదానందరూప బ్రహ్మ భావమును పొందును.)*

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని అష్టమాధ్యాయము వైరాగ్య యోగః సమాప్తము.

## 9 . నవమాధ్యాయము - శరీర నిరూపణ యోగము

## (పరమేశ్వరులు - మాయాశక్తి - దేహస్వరూపము - త్రివిధేన్ద్రియములు - తన్మాత్రలు - తద్గుణములు)

**శివుడు: రామా!** నేను దేహము యొక్క స్వరూపమును చెప్పుచున్నాను, సావధానుడవై వినుము. ఈ సకల ప్రపంచము నా నుండి పుట్టుచున్నది, నా వలన ధరించబడుతున్నది, నా యందే విలీనమగు చున్నది. నేను మాత్రము నిర్మలుడను, పూర్ణుడను, సచ్చిదానంద స్వరూపుడను, అనంగుడను, నిరహంకారుడను, శుద్ధుడను, సనాతనమైన బ్రహ్మమును. అనాదియగు అవిద్యయే మాయా శక్తి. అట్టి మాయాశక్తితో కూడి నేను జగత్కారణత్వమును పొందెదను. **సత్వ, రజో, తమో గుణములు అవిద్యకు మూల కారణములు.** ఇందులో సత్వగుణము తెలుపు వర్ణము గలది. ఇది మానవులకు సుఖమును, జ్ఞానమును కలుగు చేయుచున్నది. రజోగుణము ఎరుపు రంగు కలది. ఇది చంచలమైనది. దుఃఖమును కలుగ చేయును. తమోగుణము నలుపు రంగు కలది ఇది జడమైనది. సుఖాదుల యందు ఉదాశీనత కలిగి ఉండును. ఈ మూడు మాయా గుణములు త్రిగుణ స్వరూపము అని చెప్పబడుతున్నవి. ఇది నా సంయోగము వలన తనకు తానే విశ్వరూపముగా మార్పు చెందుతున్నది. ఈ దేహము పంచభూతాత్మకమైనది. ***(వసిష్ఠ మహర్షి దేహాన్ని పాంచబౌతాత్మికంగా చెప్తారు. ఎప్పుడైతే జీవుడు ప్రాణసంచలనములతో సహా దేహము నుండి బయల్వెడలుతాడో అప్పుడు ఈ దేహము చలన రహితము అవుతుంది. అట్లా దేహి (ఆత్మ), దేహము నుండి బయలు వెడలినప్పుడు ఈ దేహం నిస్పందం (స్పందరహితము) అవుతుంది. అప్పుడు ఇతఃడు మరణించాడు అని చెప్ప బడుతుంది. మాయారూపమైనట్టి ఈ దేహము కేవలము పరమాణువుల సంయోగమే! ....యోగవాసిష్ఠము. ఈ దేహము జడ స్వరూపము కావున నేను అనునది కాదు...భగవాన్ రమణ మహర్షి)*** ఇది తల్లితండ్రులు తినిన ఆహారము నుండి, ఆరు కోశములతో ఆవిర్భవించు చున్నది. వాటినే **షడ్విధభావములు** అందురు. అవి, **1. మాతృజము, 2. పితృజము, 3. రసజము, 4. ఆత్మజము, 5. సత్వము, 6. స్వాత్మజము** అందురు. అందు మృధువులైన శోణితము, మెదడు, మజ్జ, పైత్యము, గుదము, హృదయము, నాభి, మున్నగు జీవ పదార్ధములు తల్లి నుండి బిడ్డకు ఏర్పడును. అవి మాతృజములు. మీసము, శిరస్సు మున్నగు శరీరమందలి రోమములు, రక్తనాళములు నఖములు, దంతములు, శుక్రము ......మున్నగు స్థిరమైన పదార్ధములు పితృజములు. ఇవి తండ్రి వలన బిడ్డకు కలుగు చున్నవి. శరీర స్థూలత్వము, వర్ణము, క్రమాభివృద్ధి, తృప్తి, బలము, సామర్ధ్యము, ఆసక్తిలేకపోవడము, ఉత్సాహము .... మున్నగునవి రసజములుఉన్నవి. అవి ధాతు విశేషముచే కలుగు చున్నవి. ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, ధర్మము, అధర్మము, భావన, ప్రయత్నము, జ్ఞానము, ఆయువు,

ఇంద్రియములు .... మున్నగునవి ఆత్మజములు. ఇవి జీవుని కర్మానుసారము కలుగు చున్నవి. ఆస్తికత్వము, శుభ్రత, ధర్మాశక్తి ... మున్నగునవి సత్వగుణ జన్యములు. కామ-క్రోధ-మద మున్నగు రాజస గుణములు, నిద్ర, సోమరితనం, అజాగ్రత్త, వంచించుట మున్నగునవి తమోగుణ జన్యములగు తామసములు, ఆరోగ్యము, కుశలత మున్నగునవి స్వాతిక గుణ జన్యములు. ఇంద్రియములు ద్వివిధములు. అవి ౧. జ్ఞానేంద్రియములు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల రూపములైన చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అని చెప్పబడును), ౨. కర్మేంద్రియములు (వాక్కు, చేతులు, పాదములు, గుదము, ఉపస్థ). అంతఃకరణములు నాలుగు అవి మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అని చెప్పబడును. అంతఃకరణములే అంతరింద్రియములు. మనస్సు ఉభయాత్మకమైనది. అది సుఖ దుఃఖములను గ్రహించును. స్మృతి భీతి, వికల్పము, సంకల్పము ... మున్నగునవి మనస్సు చేయు క్రియలు. బుద్ధి - నిశ్చయాత్మకమైనది. అహంకారము - నేను, నాది అను అభిమానమును కల్గించునది. చిత్తము - ఇంద్రియగోచరములను తలపింప చేయును. ఈ నాలుగు విధములైన అంతఃకరణ వృత్తినే సత్వజము అంటారు. సత్వజము గుణభేదము వలన త్రివిధములని చెప్పబడును. అవి సత్వ, రజః, తమో గుణములు. సత్వగుణము నుండి ఉత్తమమైన సాత్విక భావములు కలుగును. రజోగుణము నుండి మధ్యమమైన రాజస భావములు కలుగును. తమోగుణము నుండి అధమమైన తామస భావములు కలుగును. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు పంచ మహా వాయువులను, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజములను పంచోపవాయువులును మొత్తము కలిపి దశ వాయువులు ... మున్నగునవి వాయుతత్వము వలన లభించును. దశ వాయువులలో ప్రాణవాయువు ముఖ్య మైనది. అది నాభి నుండి కంఠము వరకు సంచారము చేయుచుండును. అపాన వాయువు గుదము, నడుము, పిక్కలు, నాభి, గజ్జలు, తొడలు మున్నగు స్థానములందు సంచారము చేయుచుండును.వ్యాన వాయువు కన్నులు, చెవులు, చీలమండలము, నాలుక ముక్కు మున్నగు స్థానములందు ఉండును. ఉదాన వాయువు కాళ్ళు చేతులు మున్నగు అవయవము లందు ఉండును. సమాన వాయువు అగ్ని తో కూడి శరీరమంతయు వ్యాపించి ఉండును. ఇది 72000 నాడుల యందు సంచరించు చుండును. సప్త ధాతువులందు నాగాధి పంచవాయువులు వ్యాపించి ఉండును. ఎక్కిళ్ళు, వాంతులు, మున్నగునవి నాగవాయు గుణములు. కళ్ళు తెరుచుట, మూయుట మున్నగునవి కూర్మవాయు గుణములు. ఆకలి, దాహము, తుమ్ముట మున్నగునవి కృకరవాయు గుణములు. అలసత్వము, నిద్ర, ఆవలించుట మున్నగునవి దేవదత్తవాయు గుణములు. ప్రకృతిచే సుఖము, దుఃఖముల వలన నవ్వుట, ఏడ్చుట మున్నగునవి ధనంజయ వాయువు గుణములు. జీవుడు తిన్న అన్నము - జఠరాగ్నిచేత మూడు భాగములుగా విభజించబడు చుండును. అందు స్థూల భాగము - మలముగాను, మధ్యభాగము - మాంసముగాను, కనిష్ఠభాగము - మనస్సుగాను మారును.

కనుకనే మనస్సును అన్నమయమని చెప్పబడును. త్రాగిన జలమునందు స్థూల భాగము - మూత్రముగాను, మధ్యభాగము - రక్తముగాను, కనిష్ఠభాగము - ప్రాణముగాను మారును. కనుకనే ప్రాణము జలమయమని చెప్పబడును. తేజస పదార్థములైన నెయ్యి, నూనె, మున్నగునవి తిని నందున తేజస్సు నందు, స్థూలభాగము - ఎముకలుగాను, మధ్యభాగము క్రొవ్వుగాను, కనిష్ఠభాగము వాక్కుగాను మారును. కావున, ఈ జగత్తు భూమి, జలము, అగ్ని తత్వములతో ఈ చరాచర ప్రపంచమంతయు కూడి ఉంది. రక్తము నుండి మాంసము; మాంసము నుండి మేధ; మేధ నుండి ఎముకలు; ఎముకల నుండి మజ్జ; మజ్జ నుండి శుక్రమును కలుగును. వాతము, పిత్తము, శ్లేష్మము అని మూడు ధాతువులు. శరీరము నందు పది దోసిళ్ళ జలమును, తొమ్మిది దోసిళ్ళ అన్న రసము ఉండును. అర దోసిలి శుక్ర దేహము నందు ఉండును. అదియే బలము. అనగా శరీరములోని అత్యంత మహత్వ పూర్ణతత్వము శుక్రమని చెప్ప బడును. శరీరము నందు ఎముకలు - 360 కలవు. అవి జలజములు, కపాలములు, రుచరములు, తరణములు, నలకములని పంచ విధములు. 210 అస్థి సంధులు కలవు. వీటిని రౌరములు, ప్రసరములు, స్కంద సేచవములు, ఉలూఖలములు, సముద్రములు, కుండలములు, శంభావర్తములు, వాయస, తుండకములని అష్టవిధ నామములు. 3,50,00,000 రోమములు, 3,00,000 మీసములు, వెంట్రుకలు కలవు. ఓ రామా! దేహము యొక్క స్వరూపము వివరించితిని.

ఈ దేహముకంటె సారహీనమైన, నికృష్టమైన, పదార్థము మరొక్కటి లేదు. దీని యందు అభిమానముచే, బుద్ధిమంతులు, అహంకారులగు చున్నారు. అట్టివారు పాపపు పనులు చేయుచున్నారు. కావున ధీమంతులైన వారు దేహ స్వరూపమును చక్కగా తెలుసుకొన వలెను.

***(యోగావాసిష్ఠములోని భుశుండోపాఖ్యానములోను, శిఖిధ్వజోపాఖ్యానములోను వసిష్ఠుడు స్థూలంగా శరీరనిర్మాణము, యోగమార్గము ఉపదేశించారు. ఈ శివ గీతలో శరీర నిర్మాణము గురించి చాలా విపులంగా వివరించారు)***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని నవమాధ్యాయము - శరీర నిరూపణ యోగము సమాప్తము.

## 10. దశమాధ్యాయము - జీవస్వరూపయోగము

## (విభూతులు - జీవాత్మ - జీవస్వరూపము)

**శ్రీరాముడు: భగవాన్!** జీవుడు భౌతిక దేహము నందు ఎక్కడ ఉండును? ఎక్కడ నుండి జీవుడు ఆవిర్భవించు చుండెను? జీవుని స్వరూపము ఎట్టిది? దేహము గతించిన పిమ్మట, జీవుడు ఎక్కడకు వెళ్ళును? జీవుడు - మరల మరొక దేహమును పొందునా? లేదా?

**శివుడు: రామా!** నీ భక్తికి మెచ్చి, అట్టి జ్ఞానమును నీకు చెప్పుచున్నాను. నీవు అనధికారులకు చెప్పకూడదు. కావున నీవు సావధానుడవై వినుము. నేను సత్య జ్ఞాన స్వరూపుడును, అనంతుడను, పరమానంద విగ్రహుడను, పరమాత్మను, పరంజ్యోతిని, వ్యక్తము అవ్యక్తమగు కార్యములకు కారణుడను. నిత్యుడను, శుద్ధుడను, సర్వాత్మ స్వరూపుడను, నిర్లేపుడను, నిరంజనుడను, జాతి క్రియ గుణము ... మున్నగు సర్వ ధర్మములు లేనివాడను, మనస్సు చేత గ్రహింపబడువాడను కాను. సర్వేంద్రియముల చేత తెలియబడనివాడను, అన్నింటిని గ్రహించువాడను, సర్వలోకములు ఎరిగినవాడను, నన్ను తెలుసుకొను వారెవ్వరూ లేరు. షడ్భావ వికారములకు, అవిద్యా పరిణామములకు దూరుడను. వాక్కు, మనస్సులు (బాహ్యేంద్రియ అంతరింద్రియములు) నన్ను పొందలేక (తెలుసుకొనలేక) పోవుచున్నవి. ఆనంద స్వరూపుడను, పరబ్రహ్మ స్వరూపమైన నన్ను తెలుసుకొన్న జ్ఞాని ఎచ్చటను కూడా భయము పొందడు. ఎవ్వడు సకల భూతములు (జీవుడు) నాయందున్నవని తెలిసికొనునో, నన్ను సకల భూతములయందు ఉన్నవానిగా చూచునో, అట్టి జ్ఞానికి ఎక్కడిది మోహము? ఎక్కడిది శోకము? పరమాత్మ సకల భూతముల యందు ఆత్మస్వరూపముగా, నిగూఢముగా ఉంది, అజ్ఞానముచేత కనిపించకున్నది. అద్దానిని సంస్కారము, సూక్ష్మ బుద్ధి ఏకాగ్రత కల్గిన సాధకులు మాత్రమే దర్శించు చున్నారు. నేను - సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితుడను. అట్టి నేను అనాదియగు అవిద్యచేత ఆవరింపబడి, నామరూపములుగా అభివ్యక్తమయ్యెదను. పరబ్రహ్మ స్వరూపుడగు జగత్కర్తను నేనే మహేశ్వరుడను. జ్ఞాన దృష్టిచేతనే స్వప్నములో మూడులోకములు కల్పింపబడుచున్నవి. అట్లే, నా యందు అవిద్యచే జగమంతయు ఉన్నదీ, కనబడుచున్నది, విలీనమగుచున్నది. నేనే అవిద్యతో కూడి జీవస్వరూపుడనై ఉన్నాను, పంచకర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, పంచ మహావాయువులు వెరశి ఏకోనవింశతి (19 ) తత్వములు కలసి లింగ శరీరమగును. దీనిని సూక్ష్మ శరీరము అంటారు. లింగ శరీరము నందు అవిద్య సంపర్కముతో చైతన్యము (జీవము) ప్రతిబింబించును. అద్దానిని వ్యావహారిక జీవుడని, క్షేత్రజ్ఞుడని, పురుషుడని అందురు. ఆ జీవుడే అనాదియగు పుణ్య పాప ఫలములకు భోక్త! ఇహపరములకు గతి! అతడు జాగ్రదావస్థ, స్వప్నావస్థల యందు భోకృత్వము వహించును. దర్పణము

మలినముగా ఉన్నచో ప్రతిబింబము కూడా మలినముగా కనిపించును. అదేవిధముగా అంతఃకరణము దోషముగా ఉన్నచో ఆత్మ కూడా దోషముగానే కనిపించును. ఆత్మ, అంతఃకరణము రెండింటిలో పరస్పరము తాదాత్త్యము, భ్రమ వలన ఏకత్వాభిమానమును కల్గి ఉండును. అందుచే పరమాత్మ కూడా దుఃఖము పొందువానివలె ఉండును. ఇది యధార్థము కాదు. మందబుద్ధి ఎలా ఎండమావిలో జలము లేదని తెలుసుకోలేడో, అలానే నిర్లప్తమైన ఆత్మ తన అవిద్యా దోషముచే కర్తృత్వాధిక ధర్మములు గలవానిగా తోచును. నాభికి పైన కంఠము క్రిందను పురీతన్నామకమైన మాంసపిండము ఒకటి కలదు. అది సదా ప్రకాశించు చుండును. అట్టి మాంసపిండము మధ్యన క్రింధు ముఖము కలదై కాడతో కూడి కమలము పగిది హృదయముండును. ఆ దానిలో ఒక సూక్ష్మమైన ఉత్తమమైన రంధ్రము ఉందును. అది ప్రాణమునకు (జీవునకు) నివాసస్థానము. దీనినే దహరాకాశము అందురు. వుంత్రుక యొక్క కొన భాగమును నూరు భాగములుగా చేసి, అందులోని ఒక భాగమును, మరల నూరు భాగములు చేయవలెను. అప్పుడు వాటిలోని ఒకదాని యంత సూక్ష్మ పరిమాణమును జీవుడు కలిగి ఉండును. జీవుడే అనంతుడని చెప్పబడును. కదంబ కుసుమము (కడిమి పూవు) నందు ఆవరించున కేసరములవలె హృదయము నుండి నాడులు శరీరమంతటా వ్యాపించి ఉండును. హృదయ నాడులు హితమును, బలమును కల్గించును. కావున హితములని చెప్పబడును. అవి 72000 గా యోగసాధకులచే లెక్కింపబడినవి. వాటిలో 101 నాడులు ముఖ్యమైనవి. అవి సూర్యుని నుండి కిరణములవలె హృదయము నుండి శరీరమునంతటను వ్యాపించును. ప్రతి ఇంద్రియము నుండి ఆయా విషయానుభవము కొరకు పది నాడులు వెడలుచుండును. అట్లే, దశేన్ద్రియములనుండినూరు (పది పది) నాడులు కర్మము, అదృష్టము ... మున్నగువాటిని అనుసరించి జాగ్రదావస్థ స్వప్నావస్థలలో ఫలానుభవము కొరకు విషయానుభవములగు చుండును. నదులు జలమును దాల్చునట్లు, హృదయానాదులు కర్మఫలమును దాల్చును. వాటిలో "అవంతానిడి" గూఢము నుండి శిరస్సు పర్యంతము వరకు వ్యాపించి ఉన్నది. అదియే "సుషుమ్నానాడి". అద్దాని ద్వారా వెడలిన వాడు ముక్తుడగును. అచ్చట నెలకొని యుండు చైతన్యమే "జీవుడు" అని పెద్దలు చెప్పెదరు. రాహుగ్రహమెట్లు అగోచరుడై చంద్రునిలో కనబడుచున్నాడో, అట్లే సర్వగతుడైన ఆత్మ కూడా లింగ శరీర సంబంధముతో కన్నులకు అగుపడును. ఘటము (కుండ) తీసుకొనివెళ్లుచున్నప్పుడు ఘటాకాశము (కుండలోని ప్రతిబింబబము) ను కూడా తీసుకొని పోవుచున్నట్లు ఎట్లు ప్రతితమగునో అదేవిధముగా సర్వవ్యాపకమైన, చలన రహితమైన ఆత్మ లింగదేహముతో సంబంధము కల్గి ఉన్నందున కదులుచున్నట్లుగా భావింపబడును. ఆత్మయు - పరిపూర్ణము, నిశ్చలమైనప్పటికీ లింగదేహము యొక్క రాకపోకలవలన చాలించుచున్నట్లు ప్రతీతమగును. వాస్తవముగా నిష్క్రియుడైన ఈ జీవుడు జాగ్రత్తవస్థ యందు బుద్ధి, ఇంద్రియ స్ఫూర్తి కలిగి ఉండును. లింగ దేహము నుండి వృత్తులు ఉత్పన్నమగును. అవి కర్మానుసారముగా జాగ్రత్తవస్థ యందలి

ఫలానుభవము కొరకు నదులలో చేరి వెడలు చుండును. ఇట్టి లింగదేహము ముక్తి పొందేవరకు నశించదు. తత్వజ్ఞానముచేత అవిద్యతో కూడిన ఈ లింగదేహము నశించును. ఆ సమయము నందు ఆత్మ, తన సచ్చిదానంద స్వరూపము నందు నిలిచి ఉండును. అట్టి కైవల్యావస్థయే ముక్తి అని చెప్పబడును. ఘటము పగిలి పోగానే ఎట్లు ఘటాకాశము ఆకాశము యొక్క స్వసరూపములో స్థిరమై ఉండునో, అట్లే ముక్తాత్మయు తన స్వరూపము నందు స్థిరమై ఉండును. జాగ్రదావస్థలో కర్మ క్షయము అయినా తర్వాత, స్వప్న సంబంధమగు ఫలము ప్రాప్తించును. పిమ్మట జ్ఞానావస్థను కప్పి స్వప్నావస్థను పొందును. ఆ సమయము నందు దేహేంద్రియాదులలో ఆత్మ చైతన్యము యొక్క సంబంధము నిలిచి పోవును. జాగ్రదావస్థ కర్మ వలన మనస్సు నందు పూర్వ సంస్కారములను కల్గి ఉండును. జీవుడు స్వప్నము నందు ఫలానుభవేచ్చచే, తన మాయ వలన తానే మాయావంతుడగును. ఇంద్రజాలికునివలె అవస్థాంతరములను ఆశ్రయించును. స్వప్నములో జీవుడు పూర్వకర్మవాసనలచే ఘటాది విషయములను, జడపదార్ధములను, సకల భూతములను బుధ్యాది అంతఃకరణ రూపములో చూచు చుండును. స్వయంజ్యోతి స్వరూపమైన, ఆత్మ చైతన్యమునకు జీవుడు సాక్షిభూతుడై ఉండును. ఆ స్వప్నము నందు అనుభవింపబడు, అంతఃకరణము, ఇంద్రియములు శరీరములు మున్నగునవి వాసనారూపములు. వాటిచే చేయబడు వ్యవహారములు మున్నగునవి సంస్కారములు. అట్టి సంస్కారములు వలన జీవుడు వాసనాత్మకుడగును. పరమాత్మ అట్టి వాసనలకు కేవలము సాక్షి అగును. స్వప్నావస్థలో వాసనాప్రపంచము కనబడుచుండును. అది కర్మ ప్రేరేపితమైనది. జాగ్రదావస్థలోవలె కర్త, కర్మ, క్రియ అను త్రిపుటితో కూడి ఉన్నది. సమస్త బుద్ధి వృత్తులకు సాక్షి యగు ఆత్మ స్వయముగా ప్రకాశించును. అది వాసనా మాత్రమునకు సాక్షి అగుటచే స్వాపమనబడును. స్వాపమనగా తనకు తానే పూర్తిగా పొందడము. శైశవమునందు గత జన్మ వాసనలు అంటి ఉండును. వాటిని స్వప్నము నందు అనుభవించు చుండును. యవ్వనము నందు ఈ జన్మలో చేసిన కర్మ వాసనలను స్వప్నము నందు అనుభవించు చుండును. మరణావస్థకు ముందు పరలోక యాత్రకు సంసిద్ధుడైన జీవుడు, సంచిత కర్మ, ఉపాసనాబలము చేత, రాబోవు జన్మ సంబంధమైన రూపమును స్వప్నము నందు అనుభవించుచుందును.

***(భగవద్గీత ఎనిమిదవ అధ్యాయము అయిన అక్షర పరబ్రహ్మ యోగములో శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.***

***శ్లో// యం యం వాపి స్మరస్ భావం త్యజ త్యంతే కలేబరమ్ / తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః //***

***తా// ఎవడు ఏ భావమును స్మరించుతూ తుదకు దేహ త్యాగ మొనర్చునో అతడు ఆయా భావమునే పొందును. అనగా ఉత్తర జన్మ, మరణ కాలమందలి కట్టకడపటి భావముపై ఆధారపడి ఉండును.)***

జాగ్రదావస్థ, స్వప్నావస్థలలో విషయయములను అనుభవించిన జీవుడు ఇంద్రియాదులను తనలో సంస్కార రూపమున అణచుకొనును. కారణం దేహములో విలీనమగును. అనగా జీవుడు ఈశ్వరునితో ఐక్యమును

పొందును. జీవుడు నాడీమార్గము ద్వారా ఇంద్రియముల యొక్క సూక్ష్మ వాసనలను ఆకర్షించి సర్వ కార్యములను, తనలో ఇముడ్చుకున్న పిమ్మట అవ్యాకృతమగు ఈశ్వర చైతన్యము నందు విలీనమగు చుండును. అప్పుడు జీవునకు కేవలము ఆనందమే కలుగును. ఈ ప్రపంచమంతయి స్వరూపసత్తుగా లీనమై ఉండును. ఇహ పర లోకములయందు జాగ్రదావస్థ, స్వప్నావస్థ, షుషుప్తావస్థలు  మారి మారి వచ్చుచుండెను. విజ్ఞానాత్మ స్వరూపియగు కారణాత్మ (ఈశ్వర స్వరూపుడు) సద్వస్తువుల యందు కనిపించును. అవి, నష్టమైనప్పుడు కనిపించకుండును. అటువంటప్పుడు జీవుడు ఈశ్వరునిలో ఐక్యమగును. సూర్యుడు ఒక్కడే అయినను జలము, అద్దము మొదలగు వాని యందు అనేకములుగా కనిపించినట్లు, ఈశ్వరుడు నిరాకారుడైనను సాకారునివలె వచ్చుచు పోవుచున్నట్లు తోచుచుండును. ఆత్మ చైతన్య స్వభావమున స్వయంజ్యోతి! అది స్థూల, సూక్ష్మ, కారణం దేహములకంటే అతీతమైనది. అయినప్పటికీ జీవునకు మోహ (భ్రమ) రూపమైన ప్రతిబంధకముచేత తన స్వరూప స్థితి తెలియడము లేదు. అందువలన అంతయు వాటియందున్నట్లుగా తోచుచుండును. ఓ రామా! జీవుని స్వరూపమును విశదీకరించితిని.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని దశమాధ్యాయము - జీవస్వరూపయోగము  సమాప్తము.

## 11 . ఏకాదశాధ్యాయము - జీవగతి నిరూపణ యోగము

## (జీవుని గతి - జీవుని ముక్తి - ఉపాసనామహాత్యము)

**శివుడు: రామా!** నీకు ఇప్పుడు దేహాంతర గతిని గూర్చి, పరలోక గతిని గూర్చి చెప్పెదను. సావధానుడవై వినుము. భుజించిన పదార్థములు, త్రాగిన పానీయములు పక్వములై వాటి యొక్క రసములచే స్థూల దేహమునకు, లింగ దేహమునకు ప్రాణశక్తి కలుగు చున్నది. రోగముచేతగాని, ముసలితనము చేతగాని, జఠరాగ్ని మందమై, శ్లేష్మయుక్తమై తినిన అన్నము, త్రాగిన నీరు పచనం (జీర్ణము) కాదు. అందువలన రసహీనత ఏర్పడి దేహము నందలి ధాతులు శుష్కించును. రసాభావము వలన, శరీరము నందు అన్ని ధాతువులకు సమానముగా సంచారము చేయు **"సమాన వాయువు"** సరిగా సంచారము చేయకపోవటం వలన స్థూల లింగ దేహ సంబంధమునకు హాని కలుగును. అప్పుడు స్థూల దేహము నుండి లింగ దేహము వీడిపోవును. ఆ సమయము నందు ఇంద్రియముల యొక్క వాసనల వలన ఆధ్యాత్మికాది భూతములు మున్నగునవి ఆయా స్థానముల నుండి ఆకర్షింపబడి హృదయ పద్మము నందు ఏకమగును. తర్వాత ప్రాణవాయువు కలిగిన తొమ్మిది వాయువులతో కూడి, వానితో కలసి ఊర్ధ్వోచ్ఛ్వాసము తో వెడలు చుండును. అట్టి సమయము నందు జీవి ప్రాణవాయువుతో ఏకత్వమగును. విద్యాకర్మలతో (ఉపాసన, కర్మఫలము) కూడిన జీవుడు, పూర్వ ప్రజ్ఞానుసారములైన అనుభవములచే ప్రజ్ఞానాత్మ ప్రేరితుడై ఈశ్వర చైతన్యము యొక్క ప్రేరణ గలుగును. అప్పుడు నాడీమార్గమును ఆశ్రయించి కన్నుల నుండి గాని, సహస్రారాము నుండి గాని జీవుడు స్థూల దేహము నుండి దేశాంతరములకు తీసుకొనిపోవుచున్నట్లు పరమాత్మ స్వరూపమైన జీవచైతన్యము లింగ దేహముతో ఆయా స్థానములకు వెళ్లుచున్నట్లు కనిపించును. జీవి పూర్వ కర్మానుసారము ఒక దేహము నుండి మరొక దేహమును పొందుచుండును. మోక్షమును పొందునంత వరకు సంసార ప్రవాహములో జనన మరణములను రెండు ఒడ్డుల మధ్య చేప వలె సంచరించు చుండును. పాప కర్మముల భోగములను అనుభవించుటకు యాతనా దేహమును ఆశ్రయించును. యమదూతలచే నరక లోకమునకు పేదాలను. యజ్ఞ యాగాదులు నిర్వహించడము, తటాకారామాలను కట్టించడము మొదలైనవి ఇష్ట పూర్వాది కర్మలు వాటిని ఆచరించిన జీవుడు శ్రౌత స్మార్తాద్యాగ్ని వలన ధూమ మార్గమును ఆశ్రయించి తద్వారా పితృలోకమునకు వెడలును. అచ్చటి నుండి చంద్రలోకమునకు వెడలును. చంద్రలోకమునందు దివ్య దేహమును దాల్చి, జీవుని పుణ్య కర్మలు ఉన్నంతవరకు అనుభవించును. కర్మ శేషము కాగానే అదే మార్గమున నరలోకమునకు వచ్చును. జీవి, చంద్రలోకమునందలి దివ్య దేహమును విడిచి, ఆకాశతత్వమును పొందును. తర్వాత ఆకాశతత్వము నుండి వాయుతత్వమును, వాయుతత్వము నుండి జలతత్వమును క్రమముగా పొందును. పిమ్మట జలతత్వము

నుండి మేఘమును పొంది, వర్షమై కురియును. తద్వారా భక్ష్య పదార్థములైన ధాన్యాది రూపమును దాల్చును. జీవుడు కర్మచోదితుడై కొన్ని జీవులు మనుష్యాది యోనులను, మరికొన్ని జీవులు స్థావరాది రూపములను కర్మానుసారముగా పొందుచున్నారు. తర్వాత జననీజనకుల చేత భుజింపబడి శుక్రశోణితముల రూపమును దాల్చి గర్భముగా మారి కర్మానుసారము స్త్రీ, పురుష, నపుంసకులుగా జన్మించుచున్నారు.

***(భగవద్గీత ఎనిమిదవ అధ్యాయము - అక్షర పరబ్రహ్మ యోగము - లో శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. అగ్ని, తేజము, పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణము ఆరు మాసములు ... వీటి యందు గతించిన బ్రహ్మవేత్తలు పరబ్రహ్మ స్థితిని పొందుదురు. వారికి పునర్జన్మ లేదు. ఈ మార్గమును అర్చిరాది మార్గమనియు, దేవయాన మార్గమనియు అందురు. ఈ మార్గము నందు పోవు యోగులు, సూర్య మండలము ద్వారా స్వర్గమును ప్రవేశించి బ్రహ్మలోకమునకు ఏగి అచ్చట ఆత్మానుభూతి నొంది బ్రహ్మ కల్పాంతమున విదేహముక్తులు అగుదురు. పొగ, రాత్రి, కృష్ణ పక్షము, దక్షిణాయన ఆరుమాసములు ... వీటి యందు మరణించిన యోగులు చంద్రమండలమును చేరి, తిరిగి భూమియందు జన్మింతురు. ఈ మార్గమును ధూమాది మార్గమనియు, పితృయానం మార్గమనియు అందురు. ఈ మార్గమున పోవు యోగులు, చంద్రమండలం ద్వారా స్వర్గమునకు ఏగి దివ్యభోగానుభవము ముగిసిన పిమ్మట చంద్ర కిరణముల ద్వారానో, వర్షధారల ద్వారానో భూమి యందు సస్యాదులలో ప్రవేశించి అన్నరూపమున ప్రాణుల జఠరమందు జొచ్చి శుక్రముగా మారి, శుక్రశోణిత సంయోగము వలన స్త్రీ గర్భము నందు స్థూల శరీరమును ధరించి జన్మింతురు.)***

ఎవడైతే శాంతి, దాంతి ... మున్నగు సద్గుణములను కల్గి ఉండి ఎల్లప్పుడూ విద్యాసక్తుడగునో (ఉపాసనారహితుడగునో) అట్టి జీవుడు దేవయాన మార్గమున బ్రహ్మలోకమునకు పోవును. జీవుడు దేహము చాలించిన పిమ్మట, తేజోరూపముచేత దేవపురుషుడై ఆదిత్య, చంద్రలోకములకు, తర్వాత విధ్యుల్లోకమునకు చేరును. అప్పుడు ఒక దివ్య పురుషుడు ఆ జీవుడిని బ్రహ్మలోకమునకు తీసుకొనిపోవును. బ్రహ్మ లోకమున దివ్యదేహమున సమస్త కోరికలు అనుభవించి చాలాకాలము తర్వాత బ్రహ్మముతో మోక్షము పొందును. కేవలము బ్రహ్మము నందు రమించు జీవుడు నిర్వికారుడై కైవల్య ముక్తిని పొందును. బ్రహ్మజ్ఞానము కల్గిన వానికి పూర్వము అనుభవించిన సంస్కారములన్నియు తొలగిపోవును. విద్యాకర్మ శూన్యునికి తృతీయ స్థానమగు నరకము లభ్యమగును. అట్టివాడు రౌరవాది మహానరకములు ఆశ్రయించి పూర్వ కర్మ శేషము చేత నీచ ప్రాణిగా పుట్టును. రామా! నీకు జీవుని గతి, జీవుని ముక్తి గురించి విశదీకరించితిని. ఇంకా ఏమైనా స్నాదేహాలు ఉన్నచో అడుగుము.

**శ్రీరాముడు: భగవాన్!** గన్ధర్వాధి లోకములలో భోగములు ఎట్లు లభించును? దేవత్వము, ఇంద్రత్వము ... మున్నగునవి విద్యాపహాలమా? కర్మఫలమా?

**శివుడు: రామా!** యువకుడు, ఆరోగ్యవంతుడు, బలవంతుడగు మనుష్యునకు సప్త ద్వీపములు నిష్కటంకముగా పరిపాలించిన ఎట్టి ఆనందము కలుగునో అట్టి మానుషానందము విద్యాకర్మలను అనుసరించిన కలుగును. మనుష్యుడు తపస్సు చేసిన గంధర్వుడగును. గంధర్వునకు మనుష్యునికన్న శతగుణమగు ఆనందము కల్గును. గంధర్వునికంటే శతగుణమగు ఆనందము దేవగంధర్వులకు కలుగును. చిరలోకవాసులగు పితృదేవతలు, దేవతలు, ఇంద్రుడు , దేవగురువు బృహస్పతి, ప్రజాపతి బ్రహ్మ .... మున్నగువారి వరుసగా శతగుణమగు ఆనందము అధికముగా కలుగును. నిష్కామ కర్మలు చేసిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులలో బ్రహ్మజ్ఞానం కల్గిన జ్ఞాని కామమును జయించును. పాపము నుండి విడివడును. అట్టి వానికి ఉత్తరోత్తరా ఆనందమే ఆనందము కల్గును. ఆత్మజ్ఞానము కంటే ఉత్తమమమైనది లేదు. బ్రహ్మజ్ఞాని కర్మలచే వృద్ధి, క్షీణ దశలు పొందడు. మనుష్యుడు కోటి బ్రాహ్మణులకు భోజనము పెట్టినందువలన ఎట్టి పుణ్యఫలం పొందునో అట్టి పుణ్యఫలం ఒక్క బ్రహ్మజ్ఞానికి పెట్టినందువలన కల్గును. బ్రహ్మజ్ఞానిని ద్వేషించిన నరాధములు క్షయరోగ పీడితుడై మృతి చెందెదరు. ఎందువలననగా బ్రహ్మజ్ఞాని పరమేశ్వర స్వరూపుడు. ఈశ్వరోపాసకులు అధోగతిని పొందరు. కావున రామా! నీవు ఉపాసన చేసి సుఖమును పొందుము.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని ఏకాదశాధ్యాయము – జీవగతినిరూపణ యోగము సమాప్తము.

## 12 . ద్వాదశాధ్యాయము - ఉపాసనాయోగము

## (ఉపాసనావిధి - ఉపాసనాంగములు - ధ్యాన విధి)

**శ్రీరాముడు: భగవాన్! దేవ దేవేశా!** నా యందు అనుగ్రహముతో ఉపాసనావిధి, దేశకాలములను, తదంగములను వివరించండి.

**శివుడు: రామా!** నాదు అంశముచే పరిచ్ఛిన్నమగు రూపముతో సకల దేవతల యొక్క దేహములు కలుగుచున్నవి. ఎవరు అన్యదేవతలను భక్తిశ్రద్ధలతో పూజించుచున్నారో వారు నన్నే పొందుచున్నారు. కానీ వారు నా అఖండ స్వరూపమును తెలుసుకొనే లేకపోవడము చేత అది విధి పూర్వకమైన ఉపాసన కాదు. ఈ సకల విశ్వము నా యొక్క ఉనికి కన్నా భిన్నము కాదు. కావున సకల క్రియలనుఁ అనుభవించువాడను నేనే. వాటికి ఫలములను సమర్పించు వాడను నేనే. ఎవరు ఏ దేవతల యొక్క ఆకారములో నన్ను విధ్యుక్తముగా భక్తితో ఉపాసించుచున్నారో వారికీ ఆయా ఆకారములోనే ప్రసన్నుడనై వాంఛితములను నెరవేర్చు చున్నాను. మిక్కిలి దురాచారపరుడైననుఁ పశ్చాత్తాపము నొంది, అనన్య చిత్తముతో నన్ను సేవించువాడు సజ్జనుడని చెప్పబడును. ఎవడూ తన యొక్క జీవస్వరూపము మరియు నా యొక్క ఈశ్వర స్వరూపము ఒక్కటే అను అనన్య బుద్ధి కలిగి యుండునో వానికి బ్రహ్మ హత్యాది పాతకములు స్పృశింపజాలవు. ఉపాసన చతుర్విధములు.

**1. సంపదుపాసన:** గుణ సంభంధమున అల్పమైన దానిని అధికముగా చింతించుట. ఉదాహరణకు "మనస్సు అనంత విశ్వదేవత" అని చింతన చేయడము.

**2. ఆరోపోపాసన**: అంగము నందు ఆరోపించిన ఉపాసనా విధానము. ఉదాహరణకు ఓంకారము సామవేదము యొక్క ఉద్గీధమని తెలుసు కొనడము.

**3 . సంవర్గోపాసన**: క్రియాసామ్యముచే చేయబడిన ఉపాసనా విధానము. ఉదాహరణకు ప్రధమ కాలమందు వాయువు సకల భూతములను తన యందు విలీనము చేయడము.

**4. అధ్యాసోపాసన**: బుద్ధి పూర్వకముగా ఆరోపింపబడిన ఉపాసనా విధానము. ఉదాహరణకు గర్భాదానం నందు భర్త భార్య యందు అగ్ని బుద్ధిని కలిగి ఉండుట.

తత్వోపదేశమున దేవతకు తనకు ఉన్న భేదముచే దేవతాత్మత్వమును కలిగి ఉండటమే **"అంతర్గోపాసన"**. దానికంటే భిన్నమైనవి **బహిర్గతోపాసనలు.** అంతర్గోపాసనలో తదేక నిష్ఠతో ఉపాస్య దేవతలను ధ్యానింప వలెను. ఆ విధముగా దేవతా సాక్షాత్కారము కలుగునంతవరకు ధ్యానించడమే **"ఉపాసన"** అనబడును. బహిర్గతోపాసనలు అయిన సంపదాదులందు ధృడమైన బుద్ధి **"ఉపాసన"**. యజ్ఞయాగాది కర్మలు చేయు సమక్షంలో తదంగములగు ఆజ్యాదులు యందు దృష్టిని పెట్టడము **"ఉపాసన"**. రామా! నీకు ఉపాసన

గురించి వివరించితిని. ఇప్పుడు ఉపాసన అంగముల గురించి చెప్పెదను వినుము. ఉపాసకుడు తన చిత్తము ఎక్కడ ఏకాగ్రత ఉండునో అక్కడే ఈశ్వరోపాసనను కొనసాగించవలెను. కానీ **తీర్థక్షేత్రములకు వెళ్ళవలెననే శ్రద్ధను పరిత్యజించవలెను.** ఏకాంత స్థలములో నియమముగా నుండవలెను. అచ్చట కంబళి యందుగాని, మృదు తల్పం నందు గాని, వ్యాఘ్రచర్మము నందు గాని ఆసనమును ఏర్పరుచుకొనవలెను. దాని యందు కంఠము, శిరస్సు, దేహమును సమముగా నుండునట్లు కూర్చునవలెను. విభూతిని లలాటమునందు, సర్వాంగముల యందు ధరించవలెను. పిమ్మట ప్రాణాయామము ద్వారా సర్వేంద్రియములను నిగ్రహించుకొనవలెను. భక్తితో స్వగురువునకు నమస్కరించి ధ్యానయోగమును ప్రారంభించ వలెను. ఎవడు వివేక జ్ఞానము లేనివాడో, మనోనిగ్రహము లేనివాడో, చంచల మనస్సు కలవాడో, శుచిత్వము లేనివాడో వానికి సకలేంద్రియములు స్వాధీనములో ఉండవు మరియు పరమపదమగు మోక్షమును పొందలేక జనన మరణ రూపమగు సంసారమునందు తిరుగుచుండెను. . ఎవడు వివేక జ్ఞానము కలవాడో, మనోనిగ్రహము కలవాడో బాహ్యాభ్యంతరమున శౌచమును కలిగి ఉండి వానికి సకలేంద్రియములు స్వాధీనములో ఉండును మరియు పరమపదమగు మోక్షమును పొందును. అతను తిరిగి సంసారమును పొందడు. ఎవడు శరీర రూప రథమందు సారథిని వివేక జ్ఞాన స్వరూపముగా చేయునో మనస్సుకు కళ్లెము వేసి స్వాధీనములో ఉంచుకొనునో, అట్టివాడు సంసార మార్గము యొక్క అంతిమ లక్ష్యమును పొందును. అదియే నా యొక్క శ్రేష్ఠమగు **పరమపదము.** హృదయ పద్మమును రజోగుణ రహితమైనదిగాను నిర్మలమైనదిగాను, పవిత్రమైనదిగాని, శోకరహితమైనదియోగాను సాధకుడు చింతన చేయుచు నన్ను ధ్యానించవలెను. **చింతిపరానివాడు, వ్యక్తము కానివాడు, అనంతుడు, అమృత స్వరూపుడు, శుభకరుడు, ఆదిమధ్యాంతరహితుడు, ప్రశాంత స్వరూపుడు, బ్రహ్మకు కారకుడు, విభువు, చిదానందరూపుడు, పుట్టుక లేనివాడు, శుద్ధస్ఫటిక కాంతికలవాడు, అర్ధనారీశ్వరుడు, వ్యాఘ్రచర్మమును దాల్చినవాడు, నీలకంఠుడు, త్రిలోచనుడు, జటాధరుడు, చంద్రమౌళి, నాగయజ్ఞోపవీతుడు, క్రింది రెండు చేతుల యందు వార అభయ ముద్రలను, పైన రెండు చేతుల యందు పరశువు, మృగములను ధరించినవాడు, సర్వాంగముల యందు విభూతిని ధరించినవాడు, సర్వాభరణములు అలంకరించిన నన్ను ధ్యానించవలెను.** ఆత్మ (అంతఃకరణము) ను క్రింది అరణి కొయ్యగాను, ప్రణవము (ఓంకారము) ను పై అరణి కొయ్యగాను చేసి జ్ఞానముచే మథించు సాధకుడు తేజోరూపుడగు నన్ను దర్శించును.

***(మం|| ఆత్మాన మరణిం కృత్వా, ప్రణవం చో త్త రారణిం| జ్ఞాన నిర్మథనాభ్యాసాత్, పాశం (పాపం) దహతి పండితః|| తా|| ఓంకారాన్ని పైన ఉండే అరణి (కవ్వం) గా, తన ఆత్మని క్రింద ఉండే అరణిగా చేసుకొని, జ్ఞానాన్ని బాగా మథించడం అనే పరిశ్రమ చేసినవాడు బ్రహ్మ జ్ఞానాన్ని పొంది, అజ్ఞానం అనే పాషాల్ని (పాపాల్ని ) దహించి వేస్తాడు. ... కృష్ణ యజుర్వేదము, కైవల్యోపనిషత్ మంత్రము 12 )***

వేదవాక్యములను, శాస్త్రములను పాటించుట చేత లభ్యమగువాడను కాను నేను! ఎవరు ధ్యానముచే నన్ను చింతించెదరో వారికి నేను ప్రసన్నుడనై వశమగుదును. కేవలము తత్వజ్ఞానముచేతనే నన్ను పొందగలరు. త్రివిధములైన జాగ్రత్, స్వప్న, సుషుప్తి మున్నగు ప్రపంచములు ఏ పరంజ్యోతిచేత ప్రకాశింపబడుచున్నవో అట్టి పరబ్రహ్మ స్వరూపము నేనే. జాగ్రత్, స్వప్న, సుషుప్తిల యందు భోగ్యము, భోక్త, భోగము ఏవి కలవో వాటికి సాక్షిని! చిన్మాత్మస్వరూపుడగు సదాశివుడను నేనే. సూర్యచంద్రాగ్ని నేత్రములు కలిగిన నన్ను స్మరింపుము. ఒక్కడే దైవము, అది సర్వభూతముల యందు నిగూఢముగా ఉన్నది. సర్వ వ్యాపి, సర్వాంతర్యామి, సర్వాధ్యక్షుడు, సర్వభూతాదివాసుడు, సర్వ సాక్షి, కేవలము నిర్గుణుడు. మాయాశక్తిచే సర్వభూతముల యందు బీజరూపమున ఉన్న నా నిత్యా స్వరూపము ను దర్శించిన ధీరుడే నిత్య శాంతిని పొందును. నన్ను సనాతనునిగాను, మహాత్మునిగాను, సూర్యకాంతి కలవానిగాను, అంధకారములకు ఆవలనున్న వానిగాను, తెలుసుకొనిన సాధకుడు అమృత స్వరూపుడగును. మోక్షమునకు ఇంతకంటే వేరు మార్గము లేదు. పూర్వము బ్రహ్మను సృష్టించి వానికి వేద విజ్ఞానములను, అనుగ్రహించితిని. అట్టి నన్ను పురాణ పురుషునిగాను, దేవవంద్యునిగాను, తెలుసుకొనిన జ్ఞాని మృత్యువాత నుండి విడువబడును. ఎవ్వరీ విధముగా శమదమాది సద్గుణములు గల్గి ఉండి నన్ను ధ్యానించునో, అట్టి సాధకుడు నాయొక్క తత్వ స్వరూప జ్ఞానమును పొందును. సాంసారిక దుఃఖములనుండి విముక్తుడై అంత్యమున పరమేశ్వర రూపమగు నా యందే ఐక్యమగును.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని ద్వాదశాధ్యాయము-ఉపాసనాయోగము సమాప్తము.

## 13 . త్రయోదశాధ్యాయము - కైవల్య ముక్తి నిరూపణ యోగము

## (ముక్తి స్వరూపము - మోక్ష సాధనము)

**శ్రీరాముడు: పరమేశ్వరా!** ముక్తి స్వరూపము, వాటి లక్షణములు వివరించవలసినదిగా ప్రార్ధన.

**శివుడు: రామా! సాలోక్యము, సారూప్యము, సార్ష్యము, సాయుజ్యము, కైవల్యము** అని ముక్తి ఐదు విధములు. నన్ను నిష్కామముగా పూజించినవారు అజ్ఞానములేక అంతమునందు నాదు లోకమునకు వచ్చి తాను కోరిన భోగములను అనుభవించును. దీనినే **"సాలోక్యముక్తి"** అందురు. సకల కామములు లేనివాడై విధి విధానము తెలుసుకొని, నన్ను పూజించు సాధకుడు నావంటి సమాన రూపమును పొంది నాలోకములోని ప్రమదాదిగణములచే పూజింపబడును. దీనినే **"సారూప్యముక్తి"** అందురు. ఇష్టాపూర్తాది కర్మలను నాదు ప్రీతి కొరకు ఎవరు ఆచరించునో ప్రతిదినము ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలు, హోమము, తపస్సు, ఆహార నియమాలు నాకు సమర్పణ చేయుదురో అట్టి సాధకుడు అంత్యము నందు నాదు లోకమునకు వచ్చి, నాతో సమానముగా వైభవమును అనుభవించును. దీనినే **"సార్ష్యముక్తి"** (సామీప్య ముక్తి లేదా క్రమ ముక్తి) అందురు. ఎవరు శాంతి, దాంతి, మున్నగు సద్గుణములు కలిగి ఉండి నన్ను తన ఆత్మగా తెలుసుకొనునో, అట్టి సాధకుడు అంత్యము నందు పరంజ్యోతియై కేవలము అద్వైతమగు పరబ్రహ్మ స్వరూపుడు అగును. దీనినే **"సాయుజ్యముక్తి"** అందురు. ఆత్మస్వరూపంలో నిరంతరము కలసిపోవడమే **"ముక్తి"** అని చెప్పబడినది. దీనినే **"కైవల్య ముక్తి"** లేదా **"జీవన్ముక్తి"** అందురు. ఆత్మ స్వరూపమే కేవల **"పరబ్రహ్మం"**. అది సత్య జ్ఞాన స్వరూపమైనది, అనంతమైనది, ఆనంద స్వరూపమైనది, నిర్వికారమైనది, సకల ధర్మములకు అతీతమైనది, మనస్సునకు వాక్కునకు అందనిది, సజాతీయ విజాతీయ పదార్ధములతో సిద్దించక అద్వైతమను పేరుతో పిలవబడుచున్నది. రామా! ఇదియే నా స్వరూపము. శుద్ధమైనదిగా తలంచు. నాయందే స్థావర జంగమాత్మకమగు జగత్తు చూపబడుచున్నది. ఆకాశమునందు గంధర్వ నగరము (మాయా నగరము) కన్పించి మాయమైనట్లే అవిద్యచే సమస్త జగత్తు నాతోనే కల్పించబడుచున్నది. నాయొక్క స్వరూపము తెలుసుకొనుటచే అవిద్య (ద్వైత భావం) నశించి నేను మాత్రమే మనోవాక్కులకు అగోచరుడనై ఒక్కడినే ఉండెదను. కాలము, పంచభూతములు, దిక్కులు, విదిక్కులు మున్నగునవి... నన్ను విడిచి లేవు. నాకంటే భిన్నమైనది ఏదియు లేదు. నేనొక్కడినే నిత్యుడనై ఉన్నాను. నాదు స్వరూపము దర్శించుటకు శక్యము కాదు. ఎవ్వరు నన్ను కంటితో చూడలేరు. హృదయములో ఏకాగ్రచిత్తముతో ధ్యానాదులచేత నన్ను దర్శించిన మనిషి (సాధకుడు) అమృత స్వరూపమగు మోక్షమును పొందును.

శ్రీరాముడు: పరమేశ్వరా! నీదు శుద్ధ స్వరూపము మానవునకు ఎట్లు అలవడును? దానికి ఉపాయమును నాయందు అనుగ్రహమున్నచో చెప్పుము.

శంకర భగవానుడు: రామా! భోగములందు విరక్తి చెంది దయను వహించి పుత్ర కళత్ర మిత్రాదుల యందు సమభావం ఉండవలెను. మోక్ష శాస్త్రముల యందు శ్రద్ధ వహించి వేదాంత జ్ఞాన సముపార్జున కొరకు సమిధాదులను తీసుకొని శ్రోత్రియ బ్రహ్మ విష్ణువులైన సద్గురువును ఆశ్రయించవలెను. ఆచార్యుడిని చిరకాలము సేవించి వారి దయచే సకల వేదాంత వాక్యార్ధములను ఏకాగ్ర చిత్తముతో గ్రహింపవలెను. సకల వేదాంత వాక్యముల యొక్క తాత్పర్యము ఒకే నిశ్చయముగా తెలుసుకొనడమే **"శ్రవణము"** అని బ్రహ్మజ్ఞానులు చెప్పుదురు. లోహము, మణి మున్నగు..... దృష్టాంతములు యుక్తులచే వేదాంత వాక్యార్ధములను చింతన చేయడమే **"మననము"** అని పలుకుదురు. అహంకార మమకారములు లేనివాడై, రాగ ద్వేషములు విడిచినవాడై, శాంత్యాది గుణములు కలవాడై, ఆత్మ యందు పరమాత్మను దర్శించుచూ సర్వదా ధ్యాన యోగమును కలిగి ఉండుటయే **"నిధి ధ్యాసనము"** అని చెప్పబడును. సకల కర్మలు క్షయమైనప్పుడే ఆత్మ సాక్షాత్కారమగును. అది ఒకరికి శీఘ్రముగాను మరియొక్కరికి ఆలస్యముగాను కలుగును. కోటి జన్మల యందు ఆర్జించిన కర్మ రాశి జ్ఞానము చేతనే నశించును. అది ఇష్టాపూర్తాది కర్మలను ఆచరించుటచే నశించదు. ఆత్మజ్ఞానము కలిగిన పిమ్మట, ఏ పాటి పుణ్య పాపములను చేసినను వాటిచే జ్ఞాని బంధింపబడడు. శరీరము వచ్చుటకు ప్రారబ్ధ కర్మము కారణమగుచున్నది. అది జీవుని అనుభవముచే నష్టమగును కానీ జ్ఞానముచే నశింపదు. జ్ఞాని అగు వాడు మోహము లేనివాడై, అహంకారము లేనివాడై, నిర్లిప్తుడై, సంగవర్జితుడై ఉండును. సకల జీవుల యందు తన ఆత్మను, తన ఆత్మ యందు సకల జీవులను ఎవరు దర్శించునో, నన్ను ధ్యానించుచూ సంచరించునో వాడే **జీవన్ముక్తుడు**. జ్ఞాని దేనికి భయపడక, ఎవరిని భయపెట్టక ఉండును. ఎప్పుడు తన వశములైన సకల కామ వాసనలు నశించునో అప్పుడు మానవుడు అమృత స్వరూపమగు మోక్షము (బ్రహ్మము) పొందును. ఇదియే శాస్త్రము యొక్క అనుశాసనం. మోక్షమునకు ఆవాసముగాని గ్రామాంత్రముగాని లేదు. అజ్ఞానమనెడి హృదయగ్రంధిని నాశనము చేయడమే **"మోక్షము"**. ఇది స్మృతుల యందు చెప్పబడినది. వృక్షము యొక్క పై భాగము నుండి కాలు జారగానే పడి పోవును. అట్లే అజ్ఞానము నశించి ఆత్మజ్ఞానము కలుగగానే నిశ్చితముగా మోక్షము కలుగును. పుణ్య తీర్ధముల యందు గాని, ఛండాల గృహము నందు గాని చైతన్యముతో దేహమును పరిత్యజించిననూ, జ్ఞానము వలననే విముక్తి కలుగును. జీవించినప్పుడు ఏమి భుజించినను, ఎచట శయనించినను సర్వాత్మ స్వరూపుడగు జ్ఞాని ముక్తిని పొందును. పాలు నుండి తీయబడిన నేయి మరల పాలలో కరిగి పోవును. అదే విధముగా సంసారమునందున్న జ్ఞాని, మరల సంసారము (మాయ) లో ఏకత్వము చెందడు.

రామా! **ఎవరు ప్రతి నిత్యము ఈ అధ్యాయము చదివెదరో, వినెదరో వారు ఈ దేహ బంధము నుండి అనాయాసంగా విముక్తులగుదురు. కావున నీవు మనస్సును నిగ్రహించి ప్రతి నిత్యము ఈ అధ్యాయమును పఠించితే అనాయాసముగా మోక్షమును పొందెదవు.**

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని త్రయోదశాధ్యాయము-కైవల్య ముక్తి నిరూపణ యోగము సమాప్తము.

## 14 . చతుర్దశాధ్యాయము - పంచకోశ వర్ణన యోగము

## (పంచకోశములు - స్థూలారుంధతీన్యాయము - ఈశ్వర మాయ - శరణాగతి)

**శ్రీరాముడు: భగవాన్!** నీ యొక్క సచ్చిదానంద రూపము నిశ్చలమైనది, నిష్క్రియమైనది, శాంతమైనది, దోషరహితమైనది, మాయారహితమైనది. అది కర్తుత్వము, భోక్తృత్వము మున్నగు సకల ధర్మములకు అతీతమైనది. మనస్సు, వాక్కులకు అగోచరమైనది. అంతటా వ్యాపించియున్న ఆత్మ స్వరూపమైనది. ఆత్మజ్ఞానము, తపస్సులకు మూలమైనది. తత్పదముచేత పరబ్రహ్మ స్వరూపమైనది. ఉపనిషత్తులకు పరమమైనది. రూపరహితమైనది. సకల జీవుల యొక్క ఆత్మ స్వరూపమైనది. జగత్కారణమగు మాయ ... మున్నగు వాటికి కారణమైనది. శంకరా! ఈ విధముగా ఇట్టిదని చెప్పుటకు గాని, గ్రహించుటకు గాని, వీలులేనిదైయున్న అద్దానిని గూర్చి ఏ విధముగా తెలుసుకొనవలెను? అట్టి ఉపాయమును తెలియ చేయ వలసినదిగా ప్రార్థన.

**శంకరుడు: రామా!** నిర్గుణ పరబ్రహ్మమును తెలుసుకొనుటకు ముందు సగుణో పాసనచే చిత్తమును ఏకాగ్రము చేయ వలెను. పిమ్మట స్థూలారుంధతీ న్యాయము (స్థూలారుంధతీ న్యాయము అనగా ప్రక్కనున్న ఏదో ఒక గొప్ప నక్షత్రమును మొదట చూపి పిమ్మట క్రమముగా నిజమైన సూక్ష్మముగా ఉన్న అరుంధతీ నక్షత్రమును చూపుట) చేత చిత్తమును సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మము నందు లగ్నము చేయ వలెను. మాంసపిండమైన స్థూల దేహము జీవుని యొక్క అన్నమయకోశమనబడును. అది జన్మము, రోగము, ముసలితనము, మృత్యువుకు నిలయమైనది. అట్టి స్థూల దేహము నందు అభిమానము ఏర్పడి **"దేహమే నేను"** అను ఆత్మత్వబుద్ధి జీవునకు నిశ్చలముగా ఉండును. ఆత్మ నిత్యమైనది, అది జన్మించదు, నశించదు, పుట్టుట ఉండుట, మార్పు చెందుట, పెరుగుట, క్షీణించుట, నశించుట అను షడ్భావ వికారములు దేహమునకు మాత్రమే ఉండును. ఘటాకాశము వలె ఆత్మకు వికారము లేదు. నేను ఆత్మను! దేహమును కాను అని భావన చేయవలెను. అన్నమయ కోశములో ప్రాణమయ కోశము ఉన్నది. దీనిని ప్రాణాధి పంచవాయువులు స్థూల దేహముతో సంబంధమును కల్గించును. ఇందులో పంచ కర్మేంద్రియములు ఉన్నాయి. దీని ద్వారా చలనాధి క్రియలు కలుగును. ఇది ఆకలి దప్పులు కలిగి ఉండును. ఆత్మ స్వరూపము కాదు. ఆత్మ తత్వమూ చిద్రూపమైనది, అది జడమగు దేహము మున్నగు వాటిని తెలుసుకొను చైతన్యము! పరబ్రహ్మము యొక్క స్వరూపము. అందువలన క్రియ లేనిది అది దుఃఖ రహితమైన సుఖసాగరము! పరబ్రహ్మము ఒకదానికి భోగ్యము కాదు. మరియొకటి పరబ్రహ్మమునకు భోగ్యము కాదు. ప్రాణమయ కోశము నందు మనోమయ కోశము ఉన్నది. ఇది సంకల్పము, వికల్పములు కలిగి ఉన్నది. కామ, క్రోధ, మోహ, లోభ, మధ, మాత్సర్య అను ఆరు శత్రువులు (అరిషడ్వర్గములు), మమత, ఇచ్ఛ మున్నగునవి

మనోమయకోశ ధర్మములు. వేదములు, శాస్త్రముల యొక్క జ్ఞానము వలన లౌకిక, అలౌకిక విషయములను బుద్ధి నిశ్చయించును. అట్టి బుద్ధి, జ్ఞానేంద్రియములు కలసి విజ్ఞాన కోశమనబడును. ఇహలోకము నందలి సకల కార్యములు "నేను చేయుచున్నాను" అను కర్తృత్వాభావము కలుగును. ఇందు సందేహము లేదు. ఇహ, పరలోకములలో సంచరించువాడే జీవుడని వ్యవహరింపబడును. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములే పంచ మహాభూతములు. అటువంటి వాటి యొక్క సత్వగుణ అంశముల నుండి జ్ఞానేంద్రియములు కలుగు చున్నవి. ఆకాశము నుండి శ్రోత్రేంద్రియములు (చెవి), భూమి నుండి ఘ్రాణేంద్రియములు (ముక్కు) జలము నుండి జిహ్వేంద్రియము (నాలుక), తేజస్సు నుండి చక్షురింద్రియము (కన్ను), వాయువు నుండి త్వగింద్రియము (చర్మము) ఉత్పన్నములగుచున్నవి. కావున అవి పాంచభౌతికములని చెప్పబడును. పంచమహాభూతముల యొక్క సత్వగుణ వంశముల నుండి బుద్ధి, మనస్సు కలుగుచున్నవి. ఇందులో బుద్ధి నిశ్చయాత్మకమైనది. మనస్సు సంశయాత్మకమైనది. వాక్కు (నోరు), పాణి (చేతులు), పాదము (కాళ్ళు), పాయువు (గుదము), ఉపస్థ (మూత్రేంద్రియము) లు కర్మేంద్రియములు అవి పంచ మహాభూతముల యొక్క రజోగుణ అంశముల నుండి క్రమముగా ఉత్పన్నమగుచున్నవి. పంచ మహాభూతముల యొక్క రజోగుణ అంశముల చేరిక వలన పంచవాయువులు కలుగుచున్నవి. ఈ విధముగా జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, వాయు పంచకము, మనోబుద్ధి ద్వయము వెరసి సప్తదశాత్మకము లింగ శరీరము అనబడును. ఈ లింగ శరీరము కాల్చబడిన ఇనుప ముద్ద వలె పరస్పరారోపయోగాము వలన అనగా ఇనుప ముద్ద అగ్నిలోను, అగ్ని యొక్క దహన శక్తి ఇనుప ముద్దలోను పరస్పరాధ్యాస కలుగునట్లు సాక్షియగు చైతన్యముతో కూడి ఉండును. అదియే ఆనందమయ కోశము. అది సకల విషయముల యందు భోక్తృత్వమును పొందుచున్నది. అదియే ఇహపరములకు భోక్తయని చెప్పబడుచున్నది. సుషుప్తిలో లింగ శరీరముతో పరస్పరాధ్యాస విడువబడి తన నిజ స్వరూపములో నున్న చైతన్యము సాక్షిరూపముగా ఉండును. ఆ సమయము నందే సుషుప్తావస్థ సుఖమును అనుభవించును. ఆత్మ ఇంద్రియానుభవములకు స్మృతికి సాక్షియగును. అంతఃకరణములో పరస్పరాధ్యాస వలన ఆత్మలో భోక్తృత్వము, సాక్షిత్వము అను రెండు ఆరోపింపబడును. వెలుగు-నీడలు రెండు సూర్యుని ప్రకాశము వలన విరాజిల్లుచున్నట్లు, సాక్షి చైతన్యమే సుఖ దుఃఖాది భోగాలను సంభవింప చేయును. ఆ చైతన్యమే అంతఃకరణ విశిష్టమై కర్మ ఫల భోగములను అనుభవించును. క్షేత్రజ్ఞుడగు సాక్షిచైతన్యము రథికునిగాను, క్షేత్రమగు శరీరము రథముగాను, బుద్ధి సారథిగాను, మనస్సు కళ్ళెముగాను తెలుసుకొనుము. దశేన్ద్రియములే గుఱ్ఱములుగాను, ఇంద్రియ విషయములు మార్గములుగాను తెలుసుకొనుము. పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు మనస్సుతో కూడిన ఆత్మను భోక్తయగు పురుషునిగాను తెలుసుకొనుము. ఏ ద్విజుడు శాంతి. దాంతి మున్నగు సద్గుణములు కలిగి ఉండి నిత్యము

ఉపాసన చేయునో; అతడు పంచకోశములను ఒక్కొక్కదానిగా నిరాకరించి, సారమగు ఆత్మతత్వమును తెలుసుకొనును. మనుజుడు ఈ విధముగా మనస్సును నిగ్రహించి నియమములను కలిగి ఉండవలెను. తర్వాత నిరాకారమగు పరమాత్మ స్వరూపము నందు చిత్తమును లగ్నమును చేయవలెను. పిమ్మట మనస్సు గ్రహింపనలవి గాని, చూడ శక్యముగాని అనురూపమైన యుక్తిగోచరమైన పరబ్రహ్మ తత్వమును పొందు చుండును.

**శ్రీరాముడు: పరమేశ్వరా!** కొందరు శ్రవణము చేతనే వేద శాస్త్రములను తెలుసుకొన్నవారు యజ్ఞయాగాది కర్మలు నిర్వహించగలుగుతారు, సత్యమునే మాట్లాడగలుగుతారు. కానీ కొందరు శ్రవణము చేసినను, ఆత్మతత్వమును తెలుసుకొనలేరు. ఇంకా కొందరు నీ మాయాశక్తిచే అంతా మిధ్యేయని భావిస్తారు. దీనికి కారణమేమి?

**శంకర భగవానుడు: రామా!** త్రిగుణాతిమకమగు నా మాయ దివ్యమైనది. దాట శక్యము గానిది. నన్ను త్రికరణ శుద్ధిగా ఎవరు ఆశ్రయించెదరో వారు నా మాయను దాటగలరు. నాయందు శ్రద్ధలేని భక్తి హీనులు, ఐహిక ఫలములను కోరుచు అల్పమగు కర్మఫలములను పొందు చున్నారు. ఈ విషయము తెలియక ఏ నరాధములు కర్మలు చేయుచున్నారో, వారు తల్లి గర్భము నందు, మృత్యు ముఖము నందు మరల మరల పడుచున్నారు. కోటి జన్మముల యందు ఆర్జించుకొనిన పుణ్యఫలముచే నాయందు భక్తి కలుగు చున్నది. శ్రద్ధచే కూడిన భక్తుడు జ్ఞానమును పొందును. అట్టి జ్ఞానమును కోటి జన్మముల చేతనైనను, పలు సత్కర్మములు చేసినను ఎవరు పొందలేరు. కావున సమస్త కామ్యములు విడిచి పెట్టి నాయందు భక్తిని కలిగి ఉండుము. సకల ధర్మములు (లౌకిక ధర్మములు) విడిచి నన్ను ఒక్కనినే శరణు వేడుము. నేను నిన్ను సకల పాపముల నుండి విముక్తుడ్ని చేసెదను. నీవు విచారించకుము. **రామా! నీవు ఏమి చేసినను, ఏది తినినను, ఎట్టి హోమమొనర్చినను, ఏమి దానము చేసినను, ఎట్టి తపమాచరించినను అది అంతయు నాకు అర్పింపుము. రామా! నాయందు భక్తికి ఇంతకంటే వేరే సాధన లేదు.**

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని చతుర్దశాధ్యాయము-పంచకోశ వర్ణన యోగము సమాప్తము.

## 15 . పంచదశాధ్యాయము - భక్తి యోగము

## (భక్తుల లక్షణము - ఓంకారము - చతుర్ధమాత్రలు)

**శ్రీరాముడు: పరమేశ్వరా!** నీ యందు భక్తి ఏ విధముగా కల్గును? ఏ భక్తిచే నిర్వాణ రూపమగు ఉత్తమమగు మోక్షము లభించును? నా యందు అనుగ్రహముతో చెప్పండి.

**పరమేశ్వరుడు: రామా!** ఎవరు వేదాధ్యాయనము, యజ్ఞము, దానము, ధర్మము మున్నగునవి నాకు సమర్పించెదరో వారు నాకు భక్తులు, ప్రియులు. రామా! శ్రోత్రియ గృహము నుండి అగ్నిహోత్రము చేసిన భస్మము తెచ్చి శుభ్రము చేసి, దానిని **"అగ్నిరితభస్మ"** అను మంత్రములతో అభిమంత్రించి యధావిధిగా దేహము నందలి అంగములకు ధరించవలెను.

***(కృష్ణ యజుర్వేద "కాలాగ్ని రుద్రోపనిషత్" లో సద్యోజాతాది మహామంత్రాలు చదువుతూ ఏ విధంగా త్రిపుండ్ర ధారణ (విభూతిధారణ) చేయాలి అనే వివరణ ఉన్న ది.)***

అట్టి భస్మధారణలోని ఎవరు నన్ను పూజించెదరో వానికంటె ఉత్తముడగు భక్తుడు లేడు. ఎల్లప్పుడూ శిరస్సు నందు, కంఠము నందు, రుద్రాక్షమాలలను దాల్చెదరో, ఎవరు శివపంచాక్షరిని నిరంతరము జపించెదరో వారు నాకు ప్రియ భక్తులు. దేహము నందు భస్మము దాల్చి, భస్మమును శయనించి, ఎల్లప్పుడూ జితేంద్రియుడై రుద్రా సూక్తమును పఠించుతూ నిశ్చల చిత్తముతో నన్ను చింతన చేయుదురో వారు శరీరము నందే సాక్షాత్తు శివ స్వరూపులు అగుచున్నారు. **ఎవరు రుద్రా సూక్తములను, ఉత్తములైన అథర్వశిరోపనిషత్తు, కైవల్యోపనిషత్తు, శ్వేతాశ్వరోపనిషత్తు** మొదలగు వాటిని పారాయణ చేయుదురో అట్టి వారి కంటే ఉత్తమ భక్తులు లేరు. ధర్మాధర్మ కార్యముల కంటే భూత భవిష్యత్ వర్తమానముల కంటే విలక్షణమైనది ఏది కలదో అద్దానిని చెప్పెదను సావధానంగా వినుము. ఎటువంటి పరమపదమును కలుగచేయు వస్తువు పెరుగు నుండి తీయబడిన వెన్నవలె సమస్త శాస్త్రముల చేతను, వేదములతోడను తీయబడినదో, ఏ వస్తువు కోరబడినదై మునులచేత బ్రహ్మచర్య ఆచరింపబడుచుండునో అట్టి దానిని నీకు సంక్షిప్తముగా వివరించెదను. అదియే **"ఓంకారము"**. అదే నాశరహితమగు పరబ్రహ్మము. దీనిని తెలుసుకొనియె బ్రహ్మలోకమును పొందుదురు. ఇదే అక్షరము, ఇదే పరము. వేదమంత్ర రూప ఛందస్సులనెడి గోవుల నడుమ వృషభము వలె ప్రధానమైనది ఓంకారము. ఇది మోక్షసాధనమైనందున సంసార సాగరమునకు ఆనకట్ట వంటిది దివ్యజ్ఞానముతో జుట్టబడిన పరబ్రహ్మకోశమున బరుగునట్టి ప్రణవమునకు నాలుగు మాత్రలు. అవి 'అ' కార, 'మ' కార, 'ఉ' కారములు. ఈ మూడును అవసానంబున అర్ధమాత్రయును (ఇది ఆగమరీత్యా చెప్పబడినది. వ్యాకరణ రీత్యా కాదు). ప్రధమ మాత్రయగు **'అ'** కారమునకు, భూమి, ఋగ్వేదము, బ్రహ్మము, అష్టవసువులు, గార్హపత్యాగ్ని, గాయత్రి, గంగానది, ప్రాతఃస్సవన, యజ్ఞము మొదలైనవి దేవతలు. ద్వితీయ

మాత్రయగు **'ఉ'** కారమునకు భువర్లోకము, విష్ణువు, రుద్రుడు, అంస్టప్ ఛందస్సు, యజుర్వేదము, యమునానది, దక్షిణాగ్ని, మాధ్యందిన సవన యజ్ఞము మొదలైనవి దేవతలు. తృతీయ మాత్రయగు **'మ'** కారమునకు సువర్లోకము, సామవేదము, సూర్యుడు, మహేశ్వరుడు, ఆవాహనాగ్ని, జగతీ ఛందస్సు, సరస్వతి నది, సాయం సవన యజ్ఞము మొదలైనవి దేవతలు. చతుర్థ మాత్రయగు **'అర్థ' మాత్ర'** ఓంకారోచ్చారణకు చిట్ట చివరి దశ. అర్దానికి చంద్రలోకం, అధర్వణ వేదము, అంగిరసులు, సంవర్తకాగ్ని, మరుద్గోము విరాట్ ఛందస్సు సభ్యవ సంధ్యాగ్ని, శతుద్రియజ్ఞపుచ్చుడు మొదలైనవి దేవతలు. ఇందు మొదటి మాత్ర రక్త (ఎరుపు) వర్ణము, రెండవ మాత్ర భాస్వర (ప్రకాశించు బంగారు వన్నె) వర్ణము, మూడవ మాత్ర మెరుపు కాంతి, నాలుగవ మాత్ర శుక్ల (తెలుపు) వర్ణము. అంతా "ఓంకారమే". విచిత్రమగు పుట్టిన మరియు పుట్టబోవు ఈ విశ్వము అంతా ఓంకారము నందే ప్రతిష్టించబడి ఉన్నదీ. ఇదివరకు పుట్టినది, ఇక పుట్టబోవునది అంతా రుద్రా స్వరూపమే. రుద్రుని యందే ప్రాణములు ఉన్నవి. ఈ చరాచర ప్రపంచమంతయు రుద్రాభిన్నమగు ఓంకారమని చెప్పబడుచున్నది. ఈ విధముగా ఓంకారంతో రుద్రునకు అభేదము చెప్పబడినది. ఓంకారము నందే సనాతనమగు పరబ్రహ్మము లీనమై ఉన్నది. అందుచేత ఓంకారమును జపించువారు ముక్తులగుదురు. ఇందులో సంశయము లేదు. త్రేతాగ్ని (యజ్ఞాగ్ని) నుండి గాని, స్మార్తాగ్ని నుండి గాని శైవాగ్ని నుండి గాని సంపాదించిన భస్మమును ప్రణవముతో మంత్రించి ఎవరు నన్ను పూజించెదరో వారి కంటే భక్తులు నాకు లోకములో లేరు. వంటశాలలోని అగ్ని నుండి గాని, దావాగ్ని నుండి తీసిన భస్మమును గాని అభిమంత్రించి, దేహము నందు దాల్చిన వారు శూద్రులైనను ముక్తులగుదురు. కుశాగ్రములతో బిల్వదళములతో, కొండలలో లభించే పూలతో, ఓంకారమును ఉచ్చరించుతూ; నన్ను పూజించువారు నాకు ప్రియమైన భక్తులు. పూలు, పండ్లు, మూలములు, పత్రములు, సలిలము మున్నగు వాటిలో ఏదైనను ఓంకారమును ఉచ్చరించుతూ; నాకు సమర్పించినచో కోటిరెట్లు అధిక ఫలితము కలుగును. అహింస, సత్యము, అస్తేయము దొంగిలింపబడకుండుట, శౌచము, ఇంద్రియ నిగ్రహము, నిత్యము వేదశాస్త్రాధ్యాయనము మున్నగు వాటిని ఎవరు పాటించెదరో వారే నాకు భక్తులు, ప్రియులు. ప్రదోషకాలము నందు శివాలయమునకు వెళ్లి నన్ను పూజించువారు, ఉత్తమమైన ఐశ్వర్యమును పొందెదరు. పిమ్మట నాలో ఐక్యమయ్యెదరు. అష్టమి, చతుర్దశి మున్నగు తిధుల యందు పరిశుద్ధులై, సర్వాంగములకు విభూతిని ధరించి రాత్రుల యందు నన్ను పూజించువారు నాకు భక్తులు, నాకు ప్రియులు. ఇదియే కృష్ణపక్షము నందు ఇంకా విశేషముగా పూజా ఫలితము కలుగును. ఏకాదశి తిధి యందు ఉపవాసముండి, ఆనాటి రాత్రి యందు నన్ను పూజించిన భక్తులు ఎన్నటికీ నాశనమును పొందరు. ఇదియే సోమవారం నాడు ఇంకా విశేషముగా పూజా ఫలితము కలుగును. పంచామృతములతోను (ఆవు పాలు, ఆవు నెయ్యి, ఆవు పెరుగు, తేనె, పంచదార), పంచ గవ్యములతోను (ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవు నెయ్యి, గోమయము, గోమూత్రము),

పుష్పోదకము, కుశోదకము, మున్నగు వాటితో నన్ను స్నానము చేయించినవారు ... నాకు ప్రియులు. పాలు, తేనె, నెయ్యి, చెరుకు రసము, మామిడిపండ్ల రసము, నారికేళోదకం మున్నగు వాటితో రుద్రమంత్రములను (నమకచమకములను) ఉచ్చరించుతూ నన్ను అభిషేకము చేసిన వారి కంటే ప్రియతముల మరియొకడు నాకు లేరు. నీటిలో నిలబడి, సూర్యభగవానునికి ఎదురుగా చేతులు పైకెత్తి సూర్యబింబంలో నా శివ స్వరూపమును ధ్యానించి, ఆధర్యంగిరస మంత్రములను జపించవలెను. అటువంటి వారు గృహము నందు యజమాని ప్రవేశించునట్లు నా దివ్య శరీరము నందు ప్రవేశించెదరు. బృహద్రదంతరము, వామదేవ్యము, దేవవ్రతము, మున్నగు ... యాగములను చేయుచు, సామవేద మంత్రములను నా సాన్నిధ్యము నందు ఎవరు గానము చేయుదురో వారు ఇహలోకము నందు సకల సంపదలను పొందెదరు. దేహావసానము తర్వాత నా (శివ) సాయిజ్యమును పొందెదరు. ఈశావాస్యోపనిషత్తు మున్నగు ఉపనిషత్ మంత్రములను నా సాన్నిధ్యము నందు నిత్యము పారాయణ చేయువారు నా (శివ) సాన్నిధ్యము, నా (శివ) లోకమును పొందెదరు. రామా! నీకు భక్తి యోగమును చెప్పితిని. ఇది సకల కోర్కెలను నెరవేర్చును.

***(అధర్వవేద "అథర్వశిఖోపనిషత్" లో ప్రణవము (ఓంకారము) యొక్క నాలుగు మాత్రలైన అకార, ఉకార, మకార, అర్ధమాత్రల వివరణ ఇవ్వబడింది.)***

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని పంచదశాధ్యాయము - భక్తి యోగము సమాప్తము.

## 16 . షోడశోధ్యాయము - మోక్షాధికారి నిరూపణము

**శ్రీరాముడు: భగవాన్!** నీవు మోక్ష మార్గమును సులభముగా అవగతము చేసితివి. అయితే అట్టి మోక్షాధికారమునకు అర్హులు ఎవరు? ఎటువంటి వారికి లభ్యమగును వివరించ గలరు.

**శంకర భగవానుడు: రామా!** బ్రాహ్మణులూ, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, పురుషులు అందరూ మోక్షమార్గమునకు అధికారులే. బ్రహ్మచారి, గృహస్థుడు, ఉపనయనము కానీ బ్రాహ్మణుడు, వానప్రస్థుడు, వనస్థుడు కానీ వాడు, యతి, పాశుపతవ్రతుడు, జడుడు, గ్రుడ్డివాడు, చెవిటివాడు, మూగవాడు, రోగాధికారణము వలన శుచి కానివాడు, శాస్త్రీయ కర్మలను చేయనివాడు, అవివేకి, భస్మమును, రుద్రాక్షలను దాల్చి శివార్చన యందు భక్తి కలిగిన వారందరూ మోక్ష మార్గమునకు అధికారులే! శివార్చన చేయు భక్తులను ద్వేషించువారు, మోక్షమునకు అధికారులు కారు. రామా! ఎవరు నన్ను, గురువును, పాశుపతవ్రతమును ఆచరించు వానిని, విష్ణువును ద్వేషించెదరో వారు శతకోటి జన్మములకైనను ముక్తి మార్గమును పొందలేరు. అనేక లౌకిక కర్మలు చేసిన సంసారి శివజ్ఞానము తెలుకొనక, శివభక్తి లేనివాడైనచో అట్టి గృహస్థుడు సంసార బంధము నుండి విముక్తిని పొందలేరు. శాస్త్ర నిందిత ఫలాకాంక్షచే అవైదిక కర్మలైన వామాచారముల యందు ఆసక్తుడైనవాడు, తత్ఫలమునే పొందును, కానీ మోక్షాధికారి కాలేడు. వారణాసి, ద్వారక, శ్రీశైలము, చిదంబరం మున్నగు పుణ్య క్షేత్రములలో నివశించే భక్తుల యందు అనుగ్రహముతో నేను వారి దేహ అవసాన సమయమున తారక మంత్రోపదేశము చేసి, తద్వారా వారు పరబ్రహ్మ పదమును చేరెదరు. ఎవ్వని కార్యాచరణములు నియమితమై ఉండునో, విద్య, తపస్సు, కీర్తి మున్నగునవి సమకూరునో వానికే తీర్థఫలము లభించును. ఉపనయన సంస్కారము లేని బ్రాహ్మణుడు స్వధా, దానాది, పితృకార్యములలో తప్ప వేదమంత్రములను ఉచ్చరింపరాదు. ఉపనయన సంస్కారము జరుగనంతవరకు అట్టి బ్రాహ్మణుడు శూద్రునితో సమానము. పరమేశ్వర నామ సంకీర్తనమునకు, ధ్యానమునకు ద్విజులకు, ద్విజేతరులకు అధికారమున్నది. శివుడిని అయిన నన్ను ధ్యానము చేసి తననే శివునిగా భావన చేసిన నరుడు సంసార బంధము నుండి విముక్తుడగును. కావున దానము, తపస్సు, వేదాధ్యయనము తదితర కర్మలచేత లభించు ఫలము నిత్యము శివ ధ్యానము చేత కలుగు ఫలము యొక్క సహస్రాంశమునకు సమానము కాదు. జాతి, ఆశ్రమము, యమాది అష్టాంగములు, దేశము, కాలము మరియు అంగన్యాసాది కర్మలతో నిమిత్తము లేకుండా ధ్యానము నందు భావనయే ప్రధానమైనది. నడుచుచు, నిలుచుచు, పడుకొని జపించుచు, తదితరములైన పనులు చేయుచు ధ్యానము చేయు సాధకుడు, పాపము (మైల) తో కూడినవాడైనను సంసార బంధము నుండి విముక్తుడు అగును. ధ్యానాభ్యాసము వలన నాశము లేదు. స్వల్పంగా చేయబడినను ధర్మ సంబంధమైన ధ్యానఫలము మృత్యు రూపమైన మహాభయము నుండి

రక్షించును. శివ ధ్యానము చేయు భక్తునకు ఇతర భయములు ఉండవు. ఆశ్చర్యము, భయము, శోకము మున్నగు భావావేశముల యందు గాని, తుమ్ము వచ్చినప్పుడు గాని, ఏదేని నెపముతో గాని నాదు నామమును సంరించిన మానవులు పరమగతిని పొందుదురు. మహాపాపము చేసిన వాడైనను మరణ సమయము నందు, నన్ను (శివ స్మరణము) స్మరించినను, పంచాక్షరీ మహామంత్రమును ఉచ్చరించినను అట్టి సాధకుడు మోక్షమును పొందును. ఎట్టి సందేహము వలదు. ఈ చరాచరమంతా సదాశివమయముగా తలచి నిర్మల చిత్తముతో పరమేశ్వరుడిని సాక్షాత్కారించుకొను భాగవతులకు తీర్థక్షేత్రములతో పని లేదు. సాధకులు ఎల్లప్పుడూ విభూతిని, రుద్రాక్షలను ధరించ వలెను. శివ భక్తిని ఆకాక్షించు వారికి ఇట్టి విధి ముఖ్యమైనది. భస్మమును పూసుకొని, రుద్రాక్షలను దాల్చిన నరుడు మహాపాపముల నుండి విముక్తుడు అగును. ఇందులో సందేహము లేదు. శైవ సంబంధములైన తదితర కర్మలను చేసినను చేయకపోయినను ఎల్లా వేళలా శివనామమును జపించినచో ముక్తిని పొందును. ఎవ్వడు అవసానకాలము నందు రుద్రాక్షలను, విభూతిని దాల్చి ఉండునో వాడు మహాపాపములు, ఉపపాపములతో చుట్టబడిన వాడైనను, అట్టి వాని దరికి యమకింకరులు దరిచేరరు. అట్లే బిల్వ వృక్ష మూలములోని మట్టిని దేహమునకు పూసుకొనిన శివభాగవతునకు అవసాన కాలము నందు యమదూతలు దూరముగా పోవుదురు. అట్టి సాధకులు సద్గతిని పొందుదురు.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని షోడశోధ్యాయము-మోక్షాధికారి నిరూపణము సమాప్తము.

## 17 . సప్తదశాధ్యాయము – పూజావిధానము

**శ్రీరాముడు: భగవాన్!** నిన్ను ఏయే ప్రతీకలందు పూజించిన ప్రసన్నుడగుదవు? అట్టివానిని గూర్చి తెలుకోవలెనని జిజ్ఞాస కలుగుతున్నది కావున సెలవు ఈయండి.

**శంకరుడు: రామా!** మృణ్మయము (మట్టి), గోమయము, భస్మము, చందనము, ఇసుక, కర్ర, రాయి, ఇనుము, సీసము, కంచు, ఇత్తడి, రాగి, వెండి, బంగారము, కర్పూరము, రత్నము, పాదరసము ... మున్నగు వాటిచే ప్రతిమగా పరమేశ్వరుని ఆకారముగాని, శివలింగాకృతిగాని తయారుచేయుము. అప్పుడు వాటియందు నన్ను పూజించిన ఆరాధకులకు కోటిరెట్లు ఫలితము కలుగును. గృహస్థుడు మృణ్మయము (మట్టి), కర్ర, రాయి, ఇనుము, కంచు, .. మున్నగు వాటిచే పరమేశ్వరుని ఆకారముగాని, శివలింగాకృతిగాని చేసి ప్రతిష్టించవలెను. అద్దానిని పూజించిన భక్తులకు క్రమముగా ఆయువు, సంపద, వంశము, ధర్మము, పుత్రులు మున్నగునవి క్రమముగా కలుగును. బిల్వ వృక్షమును గాని, బిల్వ ఫలమును గాని, శివుని (నన్ను) ప్రతీకగా చేసుకొని పూజించిన ఆరాధకునకు ఇహము నందు మహదైశ్వర్యమును పిమ్మట కైలాసమును చేరును. బిల్వ వృక్ష సన్నిధిని విధివిధానమున మంత్రజపము చేసిన ఆరాధకునకు ఒక్కరోజుననే పునశ్చరణ పూర్తిచేసిన ఫలితము కలుగును. బిల్వ వనము నందు కుటీరము నిర్మించుకొని నివాసముండిన ఆరాధకునకు మంత్రములన్నియు జపించిన ఫలితము కలుగును. పర్వత శిఖరమున, నదీతీరమున, బిల్వ వృక్ష మూలమున, శివాలయము, యజ్ఞశాలయందు (అగ్నిహోత్రమున), హరి సన్నిధిని ఆరాధకుడు చేయు మంత్రం జపమునకు దానవ, యక్ష రాక్షస సమూహములు విఘ్నములు కల్గించలేరు. అటువంటి సాధకుడిని పాపములు అంటక అంత్యమున శివ సాయుజ్యమును పొందును. రామా! పంచమహాభూతములలో, సద్గురువులలో, అంతరాత్మలో నన్ను పూజించిన ఆరాధకుడు స్వల్ప యత్నములోనే సంపూర్ణ ఫలితమును పొందును. రామా! ఆత్మపూజతో సమానమగు పూజ మరిఒక్కటి లేదు. ***(యోగావాసిష్ఠము నిర్వాణ ప్రకరణము, దేవపూజాపాఖ్యానములో పరమేశ్వరుడు వసిష్ఠ మహర్షికి దేవపూజ విధానము తెలియచేయుచూ దేహము, చిత్తము రూపంతో ఉండేవారెవరూ దేవతలు కారు. చైతన్యమే దేవత. ఆ చైతన్యమే దేవ శబ్దంతో లోకపూజకు అర్థమౌతుంది. ఇక తదితరులందరు కేవలము ఆత్మస్వరూపులే! బాలుర వంటి వారి కొరకై కల్పిత దేవత యొక్క అర్చన విధించబడింది. యోజనము దూరమనిన భయపడు వానికి క్రోశము దూరమని చెప్పబడునట్లు నిరాకారమైన శివతత్వమును ఎరుగని వారకు సాకారమునందు అర్చన విధించ బడెను. బోధ-శాంతి-సమత్వముయే ఆత్మ దేవుని నిజమైన అర్చన. అట్టి ఆత్మ దేవతను జ్ఞానార్చనతో పూజించాలి. సర్వావస్థలలోను శరీరంలో ఉన్న శివుడ్ని ధ్యానించడమే అంతర పూజ. ప్రాణ స్వరూపంగా ఈ శరీరంలో ఉన్న ఆయనను శరీరూపధారుడిగా భావించాలి. ఈ విధంగా***

*సర్వము ఆత్మమయముగా భావించాలి. ఈ విధంగా నిర్వికారతత్వములో మనస్సు లీనమవడమే అనాయాసకరమైన దేవార్చన అని చెప్పబడుతుంది. సాత్వికం, బ్రహ్మకారం అయిన బుద్ధివృత్తి కేవలం అవిద్య యొక్క పొరని తొలగించడానికే ఉపయోగిస్తుంది. అది తొలగిపోతే బ్రహ్మం తనంతట తానే ప్రకాశిస్తుంది. దాన్నే ఆత్మసాక్షాత్కారము అంటారు భగవద్గీతలోని 12 వ అధ్యాయము "భక్తి యోగము" లో అర్జునుడు భగవానుడైన శ్రీకృష్ణుని, పరమాత్ముని సగుణ, నిర్గుణ రూపములలో దేనిని ఆరాధింపవలెనని అర్జునుడు ప్రశ్నించెను. రెండును భగవానుని చేరు మార్గములే అయినను సగుణ సాకార ఉపాసనయే భక్తులకు అనువైన మార్గమని శ్రీకృష్ణుడు సెలవిచ్చెను. అయితే ఇక్కడ కాలానుగుణముగా సాధకుడు నిరాకార రూపాన్ని పూజించుట/ధ్యానించుట బహు కష్టముగావున సాకార ఉపాసనయే అనువైన మార్గమని శ్రీకృష్ణుడు సెలవిచ్చెను).*

ఆరాధకుడు కంబళి ఆసనము నందు కూర్చొని మంత్ర జపము చేసిన సకల కోర్కెలు నెరవేరును. అట్లే కృష్ణాజినము (నల్ల జింక చర్మము) నందు చేసిన ముక్తి లభించును. వ్యాఘ్ర చర్మాసనము నందు మోక్షము, సంపద - కుశాసనము నందు జ్ఞానము, పత్రాసనము నందు ఆరోగ్యము కలుగును. పాషాణముపై (రాతిపై) జపించజిన దుఃఖము కలుగును. కాష్ఠము (కర్ర) పై జపించిన రోగము కలుగును. వస్త్రము పై జపించిన సంపద కలుగును. ఏ ఆసనము లేకుండా జపించిన మంత్ర జప ఫలము సిద్ధించదు. ఉత్తర ముఖంగా గాని, తూర్పు ముఖంగా గాని కూర్చుని మంత్ర జపమును, దేవతా పూజను ఆచరింప వలెను.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని సప్తదశాధ్యాయము - పూజావిధానము సమాప్తము.

## 18 . అష్టాదశాధ్యాయము - జప లక్షణము

**శంకరుడు: రామా!** జపమాల విధానమును చెప్పెదను సావధానుడవై వినుము. స్పటిక మాల సామ్రాజ్యమును, పుత్ర జీవమును - కుశ గ్రంధుల (దర్బ ముడుల) మాల ఆత్మజ్ఞానమును - రుద్రాక్షమాల సకల కోరికలను - పగడాల మాల లోకవశమును - అమలక (ఉసిరిక పండ్లు) మాల మోక్షమును - ముత్యాల మాల సకల విద్యలను - మాణిక్య మాల ముల్లోకములను వశమొనర్చును. నీలమణులు మరియు మరకత మణుల మాల శత్రు భయమును పోగొట్టును. బంగారముతో చేయబడిన మాల గొప్ప సంపదను, వెండితో చేయబడిన మాల కోరిన కన్యను, పాదరసముతో చేయబడిన మాల సకల కోరికలను ఒసగును. 108 సంఖ్య కలిగిన మాల ఉత్తమోత్తమమైనది. 100 సంఖ్య కలిగిన మాల ఉత్తమమైనది. 50 సంఖ్య కలిగిన మాల మరియు 54 సంఖ్య కలిగిన మాల మధ్యమమైనది. కనీసము 27 సంఖ్య కలిగిన మాల అయినాను ఉండవలెను. 25 సంఖ్య కలిగిన మాల అధమమైనది. జపమాలను ఎవ్వరికి చూపకుండా అనులోమ ప్రతిలోమా క్రమముగా జపించవలెను. 100 సంఖ్య కలిగిన మాల అయినచో 'అ' కారాది 'క్ష' కారాంతముగా జపించ వలెను. దీనినే అక్షరన్యాసము అందురు. అక్షరన్యాసము చేసిన మాల అధిక శక్తి ఉండును. అట్టి జపమునకు ఒక్క పర్యాయమునకే పునశ్చరణ పూర్తి చేసిన ఫలితము కలుగును. ఎవరు యోనిముద్రాసనమున (ఎడమ హస్తమును గుదము నందు, కుడి హస్తమును శిశ్నముపై ఉంచుట యోనిముద్ర అందురు) కూర్చుని తదేక చిత్తముతో ఇష్టదేవతా మంత్ర జపము చేయునో వారికి సకల సిద్ధులు కలుగును. మంత్ర శాస్త్ర ప్రకారము - భిన్నరుద్ర, స్థంభన, మారణ, మిలిత, మూర్చితసుప్త, మత్త, వీర్యహీన, దగ్ధ, ప్రత్యర్థి పక్ష, బాల, యూవన, వృద్ధాది మంత్రములు ఆయా కార్యముల యందు ప్రసిద్ధములైనవి. ఈ మంత్రములన్నియు యోనిముద్రయందు జపించిన వారికి సిద్ధించును. మరియొకరికి సిద్ధించవు. **బ్రాహ్మీ ముహూర్త కాలము నుండి ప్రారంభించి మధ్యాహ్న కాలము వరకు మంత్రములను జపించ వలెను. మధ్యాహ్నమైన తర్వాత జపించిన వినాశనం కలుగును. ఈ విధానము కామ్య ఫలముల నొసగు మంత్ర జపమునకు మరియు పునశ్చరణకు మాత్రమే చెప్పబడినది. నిత్యములు, నైమిత్తికములైన కర్మలు, నిష్కామమైన తపస్సు మున్నగు వాటిని ఎల్లప్పుడూ కాల నియమము లేకుండా ఆచరింప వచ్చును.** ఇందువలన దోషము లేదు.

**రామా!** ఎవరు నిష్కామ భావము కలిగి ఇంద్రియములను నిగ్రహించి నాదు స్వరూపమును ధ్యానించుచు రుద్రాధ్యాయమును (నమక చమక పరాయణములు) గాని, షడక్షరీ (ఓం నమఃశివాయ) మంత్రమును గాని, అధర్వ శిరము (అధర్వ శిరోపనిషత్తు) ను గాని, కైవల్యోపనిషత్తును గాని పఠించెదరో వారు ఈ దేహము నందే శివస్వరూపులు అగుచున్నారు.

ఈ విధముగా శివుడు రామునకు ఉద్బోధించి అంతర్ధానుడు అయ్యెను. శ్రీరాముడు తాను కృతార్థుడను అయ్యానని భావించెను.

*(ఋగ్వేద సంబంధిత "అక్షమాలిక ఉపనిషత్" లో కుమారస్వామి, బ్రహ్మదేవునికి అక్షమాల (జపమాల) భేదవిధిని గురించి, దాని లక్షణాలు, అది ఎన్ని విధాలుగా ఉంటుంది? దానికి ఎన్ని దారాలు? ఎలా గుచ్చాలి? ఏ ఏ రంగుల్లో ఉండాలి? దాని ప్రతిష్ఠ ఏది? దేవత ఎవరు? దాని వలన ఎలాంటి ఫలితాలు వస్తాయి? అని అడగగా భగవంతుడైన కుమారస్వామి వివరంగా చెపుతారు. ఈ ఉపనిషత్ ద్వారా జపము, జపమాల స్వరూపము ఈ అధ్యాయములో వివరించిన దానికి మించి వివరంగా తెలుస్తుంది.)*

**సూతమహాముని: మునీంద్రులారా!** ఎవరు ఏకాగ్ర చిత్తముతో ఈ శివగీతను పారాయణ చేయుదురో, శ్రవణము చేయుదురో అట్టివారు ఈ సంసార బంధము నుండి విముక్తులై సునాయాసముగా మోక్షము కలుగును.

అంత శౌనకాది మునిశ్రేష్ఠులందరు సూతమహామునికి ప్రణమిల్లి తమ ఆచార్యుడిగా భావించి సంతుష్టి చెంది తమ స్థానములకు వెళ్లారు.

ఇది వ్యాసోక్త శ్రీ పద్మపురాణాంతర్గత శివ గీతలోని అష్టాదశాధ్యాయము - జప లక్షణము సమాప్తము.

**శివగీత సంపూర్ణము**

**---- ఓం తత్ సత్ ----**